అభినందన సంచిక

[illegible]

# పరిష్కారం (కథల సంపుటి)

ఎం. జానకిరామ్

ప్రథమ ముద్రణ
డిసెంబరు 1989

ప్రతులు 1000
వెల 12 రూ.

ప్రతులకు
శ్రీమతి ఎం. శ్యామలాదేవి
10-204 రవీంద్రనగర్
కడప - 516 003

ముద్రణ
స్పందన ప్రింటర్స్
మచిలీపట్నం
521 001

# శుభాకాంక్షలతో నాలుగు మాటలు

అతను సాహిత్యాన్ని చక్కగా చదువుకొన్నవాడు, అంతకంటే ఎక్కువగా జీవితాన్ని చదివినవాడు.

అతను మాటకారి కాదు, అయితే అతను హితాన్ని నిర్మొహమాటంగా చెప్పగలవాడు.

అతను క్రియాశీలి. స్వర్గీయ గడియారం వేంకట శేషశాస్త్రి అవార్డుకై నెలకొల్పిన 'రచన సాహిత్య వేదిక' నాలుగు స్తంభాల్లో ఒకటి అతను. పుస్తక ప్రచురణతో సహా అనేక సాహిత్య కార్యక్రమాల ప్రణాళికా రచనలో అతని పాత్రకూడా ముఖ్యమైనది.

అతను ఆలోచనాదీక్షా, కార్యదక్షతా వున్న కార్యకర్త. కడప జిల్లా రచయితల సంఘం వంటి ప్రసిద్ధ సంస్థకు కార్యదర్శి అతను. నటుడు, నాటక ప్రయోక్త కూడా - అతను.

అతను - మా జానకిరాం ! చిత్తశుద్ధిగల రచయిత అతను. జీవితంలోనూ, కార్యకర్తృత్వంలోనూ ఎలాంటి భేషజాలు, ఆర్భాటాలు, అట్టహాసాలు ప్రదర్శించని మా జానకిరాం వ్యక్తిత్వం గొప్పది.

సంకలనాల్లో కథలూ, కవితలూ వచ్చినా, ఒక సంపుటిగా అతని రచనల ప్రచురణకు వాస్తవమైన నాంది ఇది. ఇదిగో - అతని కథా సంపుటి - 'పరిష్కారం'!.

జానకిరాం కథల్లోని ఇతివృత్తాలు – సమాజ జీవనాన్ని అంటిపెట్టుకుని వుంటాయి. అవన్నీ నేలమీద నిలబడతాయి, నడుస్తాయి. వాటిలో మనిషి బాహ్య ఆంతరిక వర్తనకీ, చలనానికీ మూలమైన ప్రేరకాల విశ్లేషణ వుంటుంది; సమాజ జీవనాన్ని ఆడిస్తున్న, పట్టి పీడిస్తున్న శక్తుల అవగాహన వుంటుంది.

రాజయ్యకు సమాజం కూడూ, గూడూ, గుడ్డా చూపించలేకపోయింది. పిచ్చివాడి చేతిలో బంతిలా అయిపోయాడు. ఈ మూడు ముఖ్యావసరాలకూ జైలు పరిష్కారంగా కనిపించింది అతనికి. అంతే. శాశ్వతంగా ఆ జైలునే ఆశ్రయం చేసుకొనేందుకు - ఓ పెద్ద నేరం చేసి యావజ్జీవ కారాగార శిక్షతో జైలు చేసుకొంటాడు. సమాజ వ్యవస్థే

ఎందరో రాజయ్యల్ని తయారుచేస్తోందని గట్టి చురక వేశాడు, రచయిత. జీవన విపర్యయం కథ.

వందలు ఖర్చుపెట్టి 'వెట్ పార్టీ'లు ఇచ్చే యజమాని. అతని దగ్గర జవాను వీరయ్య. వీరయ్య తన చేతుల మీదుగా పార్టీకి ఎన్నో తినుబండారాలు తెస్తాడు. క్షణక్షణం అతనికి నాలుగు రోజులనుంచీ మంచినీళ్ళతో పొట్ట నింపుకుని, ప్రాణాలు కళ్ళల్లో నింపుకుని పూటలు గడుపుతున్న పెళ్ళాం పిల్లలే కళ్ళముందు కనపడతూ వుంటారు. వట్టి చేతుల్తో, కాలే కడుపుతో అర్ధరాత్రి ఇంటికి చేరాడు. 'ఆకలవుతోంది నాన్నా' అంటుంది చిన్నకూతురు. వో గ్లాసు నీళ్ళిచ్చి పడుకోబెడతాడు. ఈనాటి రీతి రివాజులకి దురపిల్లే జవానుగా, అసహాయతతో గుడ్లు మిటకరించే తండ్రిగా, వేదనాభరితమైన బడుగు బ్రతుకుకి ప్రతీకగా వీరయ్య మనల్ని చాలా ప్రశ్నలు వేస్తాడు. కథ - బడుగు బ్రతుకు.

మధ్య తరగతి కుటుంబాల్లో ఆడపిల్ల వివాహం ఎంత జటిలమో, ఎన్నెన్ని సమస్యలో ? పరిష్కారం ఏమిటి ? తరతరాల నుండీ వస్తున్న ఆనువంశిక భావనా తరంగాలు నరనరానా జీర్ణించుకుపోయి, అస్తిత్వంలేని ఆడదానిగా నిలిచిపోయింది మాధవి. తెగించి ముందడుగు వేయలేని తత్వం ఆమెది. ఈ ఊబిలో ఇరుక్కోరాదనీ, ఈ చదరం

గంలో పావుగా మారరాదనీ నిశ్చయించుకొని ముందడుగు వేయగలిగిన ఆత్మస్థయిర్యంగల యువతి - లత. మాధవి చెల్లెలు ఆమె. రఘురాంని ప్రేమించి పెళ్ళి చేసుకొని మాధవి జీవితాన్ని వెక్కిరించి వెళ్ళిపోతుంది లత. ఇదే 'పరిష్కారం'!.

కోటయ్యా, కిష్టయ్యా ఇద్దరూ కూలీ నాలీ చేసుకుని బతికేవాళ్ళే అయితే ఒకరు ఆడపిల్ల తండ్రి, ఒకరు మగ పిల్లవాడి తండ్రి. కోటయ్యా తల వంచుకుని నడుస్తూ వుంటాడు, కిష్టయ్యా ధీమాగా తలెత్తుకుని తిరుగుతాడు. చాలా సున్నితమైన యదార్థ విషయం. చక్కని కథాంశ మైంది - 'మగమహారాజు' రచనలో.

ఈనాడు పెద్దమనుషులుగా చెలామణీ అయ్యేవాళ్ళు ఉద్యోగాల కోసం ఇచ్చే రికమండేషన్ లెటర్స్ ఎలా వుంటాయో చిత్రించే చిన్న ప్రహసనం - 'రికమెండేషన్'.

ఇంకా జానకిరాం కథల్లో —

కుటుంబ బాధ్యతల్ని నెత్తిన వేసుకుని ముదికన్యగా మిగిలిన కమల వంటి ఉద్యోగినులూ, అంగట్లో దొంగతనం జరిగితే - ఆ నేరాన్ని అన్యాయంగా తన దగ్గర మూటలు మోసే అసిరయ్యా మీద వేసి అతన్ని జైలుకి పంపించే పెద్ద

మనుష్యులూ; పరిస్థితుల ఒత్తిడి వలనా, ధన వ్యామోహం వలనా, లోకరీతిగా లంచాన్ని ఆశించి (ఎక్కడో సకృత్తుగా) చట్టానికి పట్టుబడిపోయే దుర్గారావు వంటి దురదృష్టవంతులూ; ఖద్దరు లాల్చీ శాల్తీ బస్‌లో సారా తాగినా 'అతను కాదు తాగింది, అతని పక్క సీట్లో కూర్చున్న కూలీ' అని ఎంతో విశ్వాసంతో భావించగలిగిన ప్రయాణీకులూ; గ్రామ రాజకీయాలకీ, చర్చలకీ, కక్షలకీ, కార్పణ్యాలకీ బలియై పోయేందుకు సిద్ధపడే ఆదర్శభావాలున్న యువతీ యువకులూ తటస్థపడతారు.

ఎందరో రక్తమాంసాలున్న మనుషులు మన కీ కథల్లో కనిపిస్తారు. వారంతా మనమధ్య తిరుగుతూ, మనతో సంభాషిస్తూ, మనలో ఒకరుగా కలిసిమెలిసిపోయి, మనలాగే - అనేక సంభవాలకి స్పందన, ప్రతిస్పందనల్ని చూపుతూ వుంటారు. అందుకనే వారంతా - మనకు దగ్గరిచుట్టాల్లా కనిపిస్తూవుంటారు.

కథాంశాల్ని ఎన్నుకోవడంలో, పాత్రచిత్రణలో జానకిరాం చాలా ముందుకి నడిచారు. శైలికూడా సరళంగా, నిరాడంబరంగా సాగిపోతుంది. కథాశిల్పపరంగా పరిణతి మార్గంలో పయనిస్తున్నారు జానకిరాం.

నిశితమైన సమాజ పరిశీలన, అభ్యుదయ దృక్పథం వున్న జానకిరాం-కథా సాహిత్యాన్ని మరింత విశ్లేషణాత్మకంగా, రచయితగా అధ్యయనం చేసి, తనదైన శిల్పాన్ని మలచుకొని మరిన్ని గొప్ప కథల్ని సృష్టించాలని ఆకాంక్షిస్తున్నాను.

అభినందనలతో, ఉంటాను మరి.

బొంబాయి
25-12-1989

విహారి

# స్పందన చందనం

అచ్చులో, వ్రాతలో - జానకిరాంగారు ఆవిష్కరించిన కథానికలు ఒక్కసారిగా చదివే అవకాశం కల్గినందుకు ఎంతో సంతోషంగా వుంది. పైకి సీదా - సాదాగా, అమాయకంగా కన్పించే జానకిరాంగారిలో ఇంతటి రచనాసంస్కారమూ, కథన శక్తి వుంటుందని నేనూహించలేదు. ఇందుకు కారణం - నాలుగేనాలుగు కథలు, ఒక్క మినీ కథ పత్రికల్లో అచ్చుకావటం. మిగతా కథల్లో మూడు మినీ కథలు (అనవచ్చు), రెండు కథానికలు అచ్చుకాలేదు. మిగతావి రేడియో కథానికలు.

వెలుగు చూచినవి కొద్దిపాటి కథానికలే అయినా, జానకిరాంగారి కథనాశక్తిని దర్పణం పట్టేలాగునే వున్నాయి. చాలా సహజమైన కథకులు వీరు. 1973 నుంచీ 1986 వరకూ చెదురు మదురుగా "మా సీమ" లో, "యువభారతి"లో, "ఆంధ్ర జ్యోతి" లో, ఆలిండియా రేడియోలో ఆవిష్కారమైనట్టివి ఈ కథలు. ఆధునిక కథాసాహిత్యంకంటే, శరత్-ఠాగూరు - ప్రేంచందుల కథాసాహిత్యంతోటే ఎక్కువ పరిచయం జానకిరాంగారికున్నట్లు - ఆయన కథానికలు చదివితే అర్థమవుతూంది - ముఖ్యంగా వీరికథల్లోని స్త్రీల పాత్రచిత్రణను గమనిస్తే.

సంఘటనను చెబుతూ కథానికను ప్రారంభించే అరుదైన శక్తి జానకిరాంగారి కథల్లో కనబడుతుంది. ఇతివృత్తానికి తగ్గ భాష, పాత్రకు అనువైన భాషను మాత్రమే వాడటం కూడా వీరిలోని మరొక్క ప్రత్యేకత, సహజమైన కథా గమనం, వాస్తవిక సంఘటనల సృష్టి, పొదుపైన

పదజాలం - జానకిరాంగారి కథనంలో కొట్టవచ్చేట్టుగా కన్పిస్తాయి. అంతేగాదు - కథ అల్లకంలో వాస్తవికతకు దూరం గాకుండా ఎంతో నిజాయితీ ప్రదర్శిస్తాడు. కథనం సూటిగా, సరళంగా, సమగ్రంగా వుండటంకోసం ఎంతో జాగ్రత్త తీసికొంటాడు. ఒక్కోసారి పది, ఇరవై సంవత్సరాల్లో జరిగిపోయిన సంఘటనల్ని ఒక చిన్న పేరాలో, ఇంకోసారి రెండు పాత్రల విభిన్న మనస్తత్వాన్ని ఒకే వొక వాక్యంలో చెప్పగల అరుదైన శక్తి, Brevity జానకిరాంగారి కథల్లో కన్పిస్తుంది.

వీరు రాసినవి కొద్ది కథానికలే అయినా, నేటి సమాజాన్ని పీడించే అన్ని సమస్యల్నీ, శాసించే శక్తుల్నీ, శాసించబడే శక్తుల్నీ, కులీనవర్గాల ప్రజలనూ, మధ్యతరగతి ప్రజలనూ, బడుగువర్గాలనూ అందరినీ దర్శించవచ్చు ఆ కథల్లో. నిశితమైన సామాజిక పరిశీలనా, అభ్యుదయ దృక్పథమూ జానకిరాంగారి కథల్లో అడుగడుగునా కన్పిస్తాయి.

కడప

వీణా రమాపతిరాజు

# నివేదన

నేను కథారచనకు శ్రీకారం చుట్టింది. "మా సీమ" పక్షపత్రిక కార్యాలయంలో. ఈ పత్రిక సంపాదకులు శ్రీ ఆర్. రాజగోపాలరెడ్డి నా కథలను శ్రీ తులసీకృష్ణ (పి రామకృష్ణారెడ్డి, ప్రస్తుతం ఆంధ్రజ్యోతిలో వుంటున్నారు)చే పరిశీలింపజేసి 'మాసీమ'లో ప్రచురించారు. అవి నాలుగు మాత్రమే. కొన్ని కథలు ఆకాశవాణి కడప కేంద్రం ద్వారా ప్రసారమయ్యాయి. మరికొన్ని అట్లేవుండిపోయినాయి.

సాహితీ సంఘాలకార్యకర్తగా ఎన్నో కవిసమ్మేళనాల్లో పాల్గొనడం, సభలూ, సమావేశాలు నిర్వహించడమూ జరిగింది. ఆ సందర్భంగా ఎందరో కవులు, మహాకవులు, రచయితలు, వ్యాసకర్తలు, లబ్ధ ప్రతిష్టులు, ప్రతిభావంతులు గావించిన సాహిత్యోపన్యాసాలు, రచనా సంవిధానాలు వినడం, చదవడం తటస్థించింది. ఫలితంగా కొన్ని కవితలు, నాటికలు వ్యాసాలు, కథలు నేను సైతం వ్రాయడం జరిగింది.

నా రచనల్లో ఏ పుస్తకమూ అచ్చుకాకుండానే వ్రాతప్రతులుగానే వుండిన నా కవితలు, నాటికలు, కథలు శ్రీ శశిశ్రీ, శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి, శ్రీ వీణా రమాపతిరాజుగార్లచే సమీక్షింపజేసి గత సంవత్సరం యువసాహితీ సమితి పక్షాన నాకు ఘనసన్మానం చేయించిన మిత్రులు శ్రీ యం. సి. కేశవకుమార్‌కు నేనెంతో ఋణపడివున్నాను. ఆ సందర్భంగానే నాటికల సంపుటి "బుద్ధం శరణం గచ్ఛామి" ని అచ్చు వేయించి ప్రచురించిన శ్రీ ఎ అనంత పద్మనాభగారికి నా కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

నా రచనా వ్యాసంగాన్ని ప్రోత్సాహపరుస్తూ అభినందిస్తూ నన్ను ముందుకు నడిపించినవారెందరో కలరు. ముఖ్యంగా " మా సీమ " రాజగోపాలరెడ్డి, పి. భుజంగరావు, పి సాంబశివయ్య, తులసీకృష్ణ, ఎం. సి. కేశవకుమార్, సత్యాగ్ని, శశిశ్రీ, వి. రమాపతిరాజు, యస్. సి. రామసుబ్బారెడ్డి, అన్నవరం ఆదిశేషయ్య వంటి ఆప్తమిత్రులెందరోవున్నారు. వాళ్ళందరికీ నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

నేను మరవకూడనిది, మరువజాలనిది, నాకు అత్యంత ఆత్మీయులైన ప్రసిద్ధ కథారచయిత, సాహితీవేత్త శ్రీ విహారి యీ సంపుటిలోని కథలను ఆమూలాగ్రం పఠించి పరిశీలించి అచ్చుకు నోచుకొనేటట్లు గొప్ప ప్రేరణ కల్గించారు. వారికి నేను సదా కృతజ్ఞుణ్ణి.

ఇక యీ కథాసంపుటి అచ్చు బాధ్యతను నాపై అభిమానముతో స్వీకరించి అందంగా తీర్చిదిద్ది మీ కందిస్తున్న మిత్రులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు (స్పందన ప్రింటర్స్, మచిలీపట్నం) వీరికి నా ప్రత్యేక అభివందనాలు

ఈ సంపుటములోని నా కథలు ఆంధ్ర పాఠకలోకంచేత ఆదరింపబడి, ఆకట్టుకోగలవని విశ్వసిస్తున్నాను.

ఎం. జానకిరామ్

# ఇందులో ఇదీ వరుస...

# పరిష్కారం

గంట తొమ్మిదయినా ఆ రోజు నాన్న గారి జపం పూర్తి కాలేదు. అది కాస్తా పూర్తయితే గాని భోజనానికి కూర్చోరు.

అమ్మ మడుగు కట్టుకొని వంట పూర్తిచేసి వడ్డించేందుకు సిద్ధంగా వుంది. తొమ్మిదింబావుకి నాన్నగారు భోజనానికి సిద్ధమయ్యారు. లతా, నేనూ మా నాన్నగారి సరసనే కూచున్నాం.

లత కాలేజికి టైమయిపోతోందని తొందరగా లేచి వెళ్ళిపోయింది. భోజనం ముగిశాక నాన్న రాత్రి యింటికి తెచ్చుకొన్న ఫైళ్ళను సైకిలుకు తగిలించుకొని వెళ్ళారు. అమ్మ వంటింట్లో పాత్రలు సర్దుతూవుంటే నేను కంచాలూ అవీ ఎత్తేసి గదంతా శుద్ధి చేసేసరికి గంట తొమ్మిది యాభై అయింది. అరగంటకు పైగా ఆయాసపడుతూ నడవాల్సిన దూరాన్ని తల్చుకుంటూ ఆఫీసుకు బయల్దేరాను.

" అమ్మా, మాధవీ, సాయంకాలం తొందరగా వచ్చేయ్, నిన్ను చూడ్డానికి పెళ్ళివారొస్తున్నారు " అంటూ అమ్మ టిఫిన్ బాక్సు చేతికందించింది.

"ఆఫీసులో పని తెమిల్తే అలాగేవస్తానమ్మా" అంటూ గుమ్మందాటాను. " ఓ గంట ముందుగా పర్మిషన్ పెట్టయినా రావే " అని అమ్మ అంటూండగా రోడ్డెక్కాను.

నేను పి. యూ. సీ. పాసై ఎలక్ట్రికల్ డివిజనల్ ఇంజనీరు ఆఫీసులో లోయర్ డివిజన్ గుమాస్తాగా చేరి అప్పుడే నాలుగేళ్ళు దాటుతోంది. అంతకు ముందు ఏడాది క్రితం అక్కయ్య లక్ష్మి పెళ్ళి జరిపించారు నాన్న. పదివేలు కట్నంతో దాదాపయిదువేల ఖర్చుల్తో వెటర్నరి డాక్టరైన శేఖరం మా బావయ్యారు. నేను వుద్యోగంలో చేరిన ఆరునెలలకే స్టేట్ బ్యాంక్ లో పనిస్తున్న మా చంద్రమ న్నయ్య పెళ్ళి కూడా జరిగిపోయింది. కాని మా వదినెగారితో బాటు వచ్చిన కట్నంతో నాన్నగారి అప్పులు సగానికూడా తీరలేదు. అందుకని వెంటనే నా పెళ్ళి ప్రయత్నాలు సాగించ లేదు నాన్న. ఈ మధ్య కొన్ని సంబంధాలు రావడం మొదలైనా సరైన సంబంధాలు కాకపోవడం వల్ల నాన్న పెళ్ళిమాపులదాకా రానివ్వలేదు.

నాన్నగారేం చేసినా మా శ్రేయస్సు కోరే చేస్తారు. నాకున్న కొద్దిపాటి చదువుతోటే నాకు వుద్యోగం చేసే అదృష్టం కల్గినందుకూ, వేన్నీళ్ళకి చన్నీళ్ళతోడైనట్లు కుటుంబ

పోషణకి నా సంపాదన కలుస్తున్నందుకు తృప్తీ, సంతోషమూ నా మనస్సును పులుముకొన్నాయి.

ఆఫీసులో అడుగెట్టి సీట్లో కూర్చొని ఆ రోజు తపాలు తిరగేసి నిన్నటి మిగిలిపోయిన ఫైళ్ళలో తలదూర్చాను. కొన్నిటికి రిమైండర్లు వ్రాసి, కొన్నిటికి జవాబులు తయారుచేసి మరికొన్నిటిలో స్టేట్మెంటు పూర్తిచేసి సెక్షన్ హెడ్డుకి పంపించి, ఆఫీసరు అప్రూవ్ చేసిపంపిన కాగితాలను టైపుకిచ్చి పంపడంతో గంట నాలుగైంది. మరుసటి రోజుకు సిద్ధంచేయాల్సిన కాగితాలనూ, అందుకు సంబంధించిన ఫైళ్ళనూ పరిశీలిస్తూ కూర్చున్నాను. అంతలో అమ్మ మాటలు గుర్తొచ్చి ఎప్పుడెపుడు అయిదవుతుందా అనుకుంటూ ఫైళ్ళు తిరగేస్తూవున్నా అమ్మచెప్పినట్లు పర్మిషన్ అడగడానికి మనస్కరించలేదు. అయిదవుతూనే హడావిడి లేకుండా నెమ్మదిగా ఫైళ్ళన్ని ఒక్కొక్కటే కట్టేసి ఇంటికి బయల్దేరాను.

ఇంటికెళ్ళేటప్పటికి అమ్మ నా కోసం కాచుకుని వుంది. చెల్లెలు లత కాలేజీనుండి యింకా యింటికి రాలేదు. అది వుమెన్స్ కాలేజీలో ఫస్టియర్ బి.యస్సీ చదువుతూ వుంది. కాలేజీ వదిలినా ఓ గంటపాటు టెన్నికాయట్ ఆడందే యింటికిరాదు.

" ఓ అరగంటలో వాళ్ళొచ్చేస్తారు, మీ నాన్నగారు వాళ్ళ కోసమే వెళ్ళారు. త్వరగా కాళ్ళు ముఖం కడుక్కొని మంచి బట్టలు కట్టుకో" అని పురమాయించి అమ్మవంటింట్లో

టిఫిన్లూ అవీ సర్దడానికి వెళ్ళింది. అమ్మ ఆజ్ఞ పాటించాలి. కదా అని నేను పెళ్ళి చూపుల ముస్తాబుకు వుపక్రమించాను కాసేపట్లోనే లత కూడావచ్చి నాకు సాయంచేసింది.

ఆరుంబావుకల్లా పెళ్ళివారొచ్చారు. పెళ్ళి కుమారునితోబాటు వాళ్ళ తండ్రీ, మేనత్తా, మరో యిద్దరు చుట్టాలు వచ్చారు. టిఫిన్లూ కాఫీలూ అయ్యాక అమ్మ నన్ను వాళ్ళ ఎదుటికి తీసికెళ్ళి కూచోబెట్టింది. యాదాలాపంగా వాళ్ళు నా పేరు వగైరాలడిగి తెలుసుకొన్నారు. అబ్బాయి యం. బి. బి. యస్ నాలుగో సంవత్సరం చదువుతున్నాడు. పెళ్ళి చూపులయ్యాక నాన్న వాళ్ళతో కట్నాలూ కానుకల విషయం ప్రస్తావించారు. పాతిక వేల కట్నంతో యితర లాంఛనాలతో పెళ్ళి జరిపించాలని వారు కోరారు. అంతేగాక ముందుగా పదివేలివ్వాలట, తర్వాత పెళ్ళిరోజున మిగతా పైకం చెల్లించాలి. పైగా ఏ విషయమూ మూడురోజుల్లో తేల్చి చెప్పాలి నాన్నగారు. అంతావింటూ ండగా మా నాన్న మాటేమోగాని నా కేమో గొంతులో తడారిపోయింది. నాన్న నెమ్మదిగానే అంత స్తోమత తనకు లేదని తేల్చిచెప్పి వాళ్ళను సాగనంపాడు.

తర్వాత భోజనాల సమయంలో అమ్మ "డాక్టర్లూ ! ఇంజినీర్లుగాని మనకు తగిన సంబంధం చూసి కుదిరించండి" అంది నాన్నతో. "అన్ని విధాలా మనకు నచ్చి మన తాహతుకు తగినవాడికే మనమ్మాయి నిచ్చిచేస్తాంగాని పెళ్ళి సంబం

ధానికంటూ వచ్చిన వాళ్ళని రానద్దని ఎలా అనగలం? ఇరు వైపులా న చ్చే ంత వ ర కూ మనం ఓపిక ప ట్టా లి ” అన్నారు నాన్న.

యాంత్రికంగా ఆరు మాసాలకాలం గడిచిపోయింది. ఓరోజు నాన్నగారి మిత్రుడొకాయన ఇన్సూరెన్సు డెవలప్మెంటు ఆఫీసరుగా చేస్తున్న ఒకతణ్ణి మా యింటికి వెంటబెట్టుకొచ్చారు. అతడిదివరకే నన్ను ఆఫీసుకు వస్తూ పోతూవున్నపుడు చూచాడట. అతనికి తండ్రి లేడు. తల్లి, తాను మాత్రమే అతని కుటుంబం. కట్నాలతో నిమిత్తం లేకుండానే పెళ్ళి చేసుకోదల్చానని స్పష్టంగా చెప్పేశాడు. అబ్బాయి పుట్టుపూర్వోత్తరాలన్నీ ఆరాతీశాక నాన్న “అంతా బాగుంది కాని అబ్బాయి శాఖాంతరం. మా అమ్మాయినివ్వలేం” అనేశారు. అమ్మ కూడా, ఆ పెళ్ళిపెద్దతోబాటు ఎంతగానో నచ్చచెప్ప జూచింది “ ఇంకా యీ కాలంలో శాఖలేమిటి ” అని. కాని నాన్న మాత్రం ససేమిరా వీల్లేదన్నారు.

అలా కట్నాల్తో తూగలేక కొన్ని, శాఖల్లో చిన్న చిన్న భేదాల్తో కొన్ని, ఆకర్షణీయమైన హోదా, అంతస్తులేక కొన్ని ఎగిరిపొయ్యాయి. రోజులు గడిచేకొద్దీ నాతోబాటు లతకు కూడా పెళ్ళి చేయాల్సిన అగత్యాన్ని అమ్మ రోజూ నాన్నకు గుర్తు చేస్తూనేవుంది, నాన్నేమో కాలం, ఖర్మం కలిసిరానిమ్మంటూ నే రోజులు వెళ్ళబుచ్చుతున్నాడు.

ఈ మధ్యే క్రొత్తగా మా ఆఫీసులో మోహనరావనే అతడు అకౌంటెంటుగా చార్జి పుచ్చుకున్నాడు. వచ్చిన రోజు నుంచీ అతడు అందరితోనూ ఎంతో కలుపుగోలుగా వుంటున్నాడు. ఆయన మావూరొచ్చిన రెణ్ణెల్లలో అతని చెల్లెలి పెళ్ళి జరిపించాడు. ఆఫీసులో అందర్నీ ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు. ఎలాటి ఆడంబరం లేకుండా పెళ్ళి పూర్తి చేయించాడు. మాటల సందర్భంలో తనకు తగిన అమ్మాయి తటస్థపడితే తానూ ఓ యింటి వాణ్ణవ్వాలని అందరికీ చెప్పాడు.

మోహనరావు ఎలాంటి అమ్మాయిని పెళ్ళాడినా సర్దుకొని సాఫీగా జీవితం గడుపుకొని పోయే వ్యక్తి అని ఎవరికైనా తెలుస్తుంది. జీవితాన్ని యిటు ఎండమావిలా కాకుండా అటు ఎడారిలా కాకుండా జీవితాన్ని జీవితంగానే సాగిస్తున్న వాడతడు. మానవునికి అనవసరమైన ఆశలూ, అసంగతమైన ఆశయాలూ తగదనే నమ్మిక కలవాడు మోహనరావు.

ఒక రోజు సాయంకాలం నా సీటు ప్రక్కగా నిలబడి "మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి, పార్కునద్దకు రాగలరా?" అని నన్ను నిర్మొగమాటంగానే అడిగాడతడు. పార్కులో అతన్తో మాట్లాడుతూ ఒంటరిగా కూర్చోవడాన్ని తలపోస్తూ నేను బెంబేలెత్తిపోయాను. అతడా విధంగా అంటు

న్నపుడే చెప్పలేనంతగా దడదడలాడింది. అతడడిగిందానికి సమాధానం కూడా యివ్వకుండా అలాగే యింటి ముఖం పట్టాను.

ఆయన నా పరిస్థితి అర్థం చేసుకొన్నాడల్లేవుంది. నాల్రోజులపాటేమీ మాట్లాడకుండా వుండిపోయాడు. నేను కూడా నలుగురూ కలిసి చెప్పుకొనే కబుర్లలో మాత్రం ముక్తసరిగా మాట్లాడుతూ వుండేదాన్ని.

ఓరోజు ఒక అర్జెంటు ఫైల్ నోట్ వ్రాసి ఆఫీసరు యింటికి పంపేటప్పటికి సాయంత్రం ఆరు దాటింది. అప్పటికే ఆఫీసులో చాల మంది యిళ్ళదారి పట్టారు. అకౌంటెంటు మోహనరావు తన సీటులోంచి యింకా లేవలేదు. ఆఫీసులో అతడుగాక ప్యూను రామయ్య మాత్రం మిగిలాడు. నేను ఫైల్ని ఆఫీసరు యింటికి వెళ్ళే బాక్సులో సర్ది రామయ్యకు విషయం చెబుతుండగా మోహనరావు " మీరింకా పన్జేస్తున్నారా? " అంటూ నా టేబిల్ వద్దకు వచ్చాడు. రామయ్య గదుల తలుపులూ కిటికీలూ మూస్తూ వుండగా మేం బయటికి నడిచాము.

" ఒక రెండు నిముషాలు లాన్లో ఫౌంటన్ దగ్గర నిలబడదాము రండి. మీతో నేను చెబుదామనుకొంటున్న నాలుగు మాటలూ చెప్పేస్తాను " అని దారి తీశాడు. నాకతన్ననుసరించక తప్పిందికాదు. అతడు నీళ్ళలో చేతులు కడుక్కుంటూ "మీరు బాగా ఆలోచించి చెప్పాలి. మీకిష్ట

మైతే నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకొంటాను. ఇది ప్రేమ వ్యవహారంగా భావించకండి. పెళ్ళి వ్యవహారంగానే యీ విషయాన్ని మీ ముందుంచుతున్నాను. బాగా ఆలోచించి చెప్పండి. ఎదుటివాళ్ళని గౌరవించే వాణ్ణి గాబట్టి మీకిష్టమైతే సంతోషిస్తాను. లేకుంటే అసలు బాధపడను ఇదీవిషయం. ఇక వెడదాం" అంటూ అతడే అగుగుదారి తీసాడు.

మోహనరావు చెప్పిన మాటల్ని సావధానంగా విని యింటికి కెళ్ళాను. ఆరాత్రంతా అంతులేని ఆలోచనల్లకు గురైంది మెదడు. ఈ విషయాన్ని నాన్నతో చెప్పడమా, మానడమా చెప్పాలంటే ఏవిధంగా చెప్పాలి? చెబితే నాగురించి ఏమను కొంటారో ! అతను మా కులంవాడు కాదు. శాఖాంతరమే ఒప్పని నాన్న కులాంతర వివాహాని కెలా అంగీకరిస్తాడు ? ఇలా అనేక విధాల ఆలోచనలతో నా మనస్సు నిండి పోయింది. మోహనరావు మన స్తత్వానికి, అతని వ్యక్తిత్వానికి ఎవరైన జోహారనాల్సిందే. కాని నా పరిస్థితి? చివరి కెటూ నిర్ణయించుకోలేక రాత్రంతా నిద్రలేని కారణాన ఒళ్ళు బద్ధకించి తల నొప్పి పుట్టి మగుదినం ఆఫీసుకి సెలవు పెట్టాను. నాన్న యింట్లో వున్నంత సేపూ ఏదో విధంగా మోహనరావు గురించి చెబుదామని ఎంతగానో అరాట పడ్డాను. కాని నాన్న ఎదురవగానే ఎలా ప్రారంభించాలో, ఏమని చెప్పాలో బోధపడక మూగదాన్నయ్యాను. నాన్న ఆఫీసు కెళ్ళాక

కనీసం అమ్మతోనైనా విషయం చూచాయగా కదిలిద్దామని ప్రయత్నించాను. కాని కులగోత్రాల పట్టింపుల నుండి సరిగా నేనే పూర్తిగా దూరంగా లేనపుడు, నాకంటే ఒక తరం ముందుదైన అమ్మ ఒప్పుకోగలుగుతుందా, నాన్నను ఒప్పించ గల్గుతుందా? అనే సందేహానుమానాల మధ్య ఆరోజంతా వూగిసలాడిపోయాను.

జీవితానికి సాకార నిర్వచనంగా వెల్లడయ్యే మోహన రావుతో కలిసి నాజీవితాన్ని సార్థక్యం చేసుకొనే భాగ్యం నాకు లేకపోయెనే అని నా హృదయం మూగగా మూలిగింది యింట్లో వాళ్ళ కెవ్వరికి వినిపించకుండా.

మరునాడు వుదయాన్నే యధారీతి కాలకృత్యాలు తీర్చుకొని ఆఫీసు టైం అయ్యేవరకూ వంటలో సాయం చేసి నాన్నగారితో బాటు భోంచేసి టిఫిన్ బాక్సు తీసుకొని ఆఫీసుకు బయలుదేరాను. ఇరవైమూడేళ్లు నాకు. యింకా ఎన్నేళ్ళు నాన్న నీడనె జీవితం వెళ్ళబుచ్చాలనే ఆలోచన అనుకోకుండా కలిగింది నాకు. కాని దానికి పరిష్కార మార్గం నిర్ణయించు కోలేని దౌర్బల్యం భూతంలా ఆవరించింది నన్ను.

పరి పరి ఆలోచనలతో వేడెక్కిన మెదడుతో భవిష్య జ్జీవన గమనాన్ని నిర్ణయించుకోలేక బరువెక్కిన హృదయంతో కాళ్ళీడ్చుకొంటూ ఆఫీసు చేరాను. యాంత్రికంగా నే దినమంతా గడిచిపోతూంది. సాయంత్రమైనదు కాగానే ఫైళ్లు

సర్దుతూ మోహనరావెప్పుడు బయల్దేరతాడా అని ఒక ప్రక్క కనిపెట్టసాగాను. ఆయన కదుల్తున్న చప్పుడు పసికట్టి నా సీటు లోంచి లేచి బయట పడ్డాను. అతడు నన్ను కలుసుకునేందుకు వీలుగా నెమ్మదిగా అడుగులు వేస్తూ బయలుదేరాను. బయట మోహనరావు సమీపించగానే "నేరుగా పార్కుకి పదండి మాట్లాడుకొందాం" అన్నాన్నేను. నామాటలు వినగానే మోహనరావు ముఖం వికసించి కళ్ళలో వెలుగు విరజిమ్మింది. దారిలో ఏమి మాటలు లేకుండా పదినిమిషాల్లో పార్కుచేరు కొన్నాం. పార్కులో ఓ మూల బెంచీ కిరువైపులా చివర్న ఆసీనులైనాము.

ఎంతైనా మగాడు కాబట్టి అతడే సంభాషణకుప క్రమిస్తూ "ఏమిటి తేల్చారు మీ నిర్ణయం?" అంటూ పలకరించాడు.

"చూడండి మోహనరావు గారూ! నేను పెరిగిన పరిరాసలను బట్టి, మా కుటుంబ పరిస్థితులను బట్టి నేనేమీ తేల్చుకోలేక మీకు సరైన నిర్ణయాన్నందించలేని అయో మయస్థితిలో వున్నాను" అని వేదనా పూరిత స్వరంతో నేననగానే "నేను నిర్మొహమాటంగా అడిగానని యిబ్బంది పడకండి మాధవిగారూ! నిమ్మళంగా ఆలోచించుకొని మీ తల్లిదండ్రులతో కూడా సంప్రదించి చెప్పండి" అన్నాడు మోహనరావు తాపీగా.

" మా అమ్మా నాన్నలతో నా పెళ్ళి విషయాన్ని సూటిగా సంప్రదించే పరిస్థితుల్లో నేను లేనని చెప్పటానికి నాకెంతో బాధగా వుంది " అన్నాను నిర్వేదంగా.

" మీ వ్యక్తిగత సమస్యని మీరు పరిష్కరించుకోవడంలో తలిదండ్రులుగాని మరెవరైనా నిమిత్త మాత్రులుగా సహాయపడే వారే కాబట్టి మీ భవిష్యత్తు కొఱకు మీరే చొరవ తీసుకోవడం సమంజసం. మీ కభ్యంతరం లేకపోతే నేనే మీ నాన్నగారి .. ...."

" అయ్యయ్యో, అంతపని చేయకండి. మా నాన్న సంప్రదాయాలకూ, అనువంశిక ఆచారాలకూ కట్టుబడిన వ్యక్తి, లేకుంటే నేనిలా అస్వతంత్రురాలిని గాకపోదును " పేలవంగా అని అతని మాటల నడ్డుకొన్నాను.

" ఈ పరిస్థితుల్లో మిమ్మల్ని చూస్తే జాలేస్తూంది, ఆరేడేళ్లుగా నా జీవిత భాగస్వామిని కొఱకు అన్వేషిస్తూ వచ్చాను. మీరు తటస్థపడ్డారు. కాని నా అన్వేషణ పునః ప్రారంభించాలి. మీకు శ్రమయిచ్చాను. పదండి వెళ్దాం " అని పార్కు బయటికి దారితీశాడు బరువుగా అడుగులేస్తూ. నేను పార్కు బయటిదాకా అతన్ని అనుసరించి, సెలవు పుచ్చుకొని యింటిదారి పట్టాను.

నాన్న ఎంతటి సంబంధం తెచ్చినా మోహనరావుతో సరిపోలక పోవచ్చునని నాకు బాగా తెలుసు. కాని నా మనో దౌర్బల్యాన్ని అతని మనో నైర్మల్యం కూడా తొలగించలేక

పోయింది. తరతరాలనుండి వస్తున్న అనువంశిక భావనా తరం గాలు నా నరనరానా జీర్ణించుకొనిపోయినందు వల్ల అస్తిత్వం లేని ఆడదానిగా నిరూపించుకొన్నాను.

మరో ఏడాది గడిచింది, లత బి. యెస్సీ. ఒకపార్టు పోగొట్టుకొని సప్లిమెంటరీ పరీక్షకు కట్టింది. ఈ శ్రావణం లోగా నా పెళ్ళి ఎలాగైనా జరిపించాలని నాన్న పట్టుదలగా వున్నారు. మా నాన్న నెరిగున్న వారి ద్వారా నాకు మరో సంబంధం వచ్చింది. అబ్బాయి బి.కాం. దొరికితే ఉద్యోగం చేయాలని లేకుంటే యం. కాం. బెనారసో, సాగరో వెళ్ళి చదవాలని వుద్దేశ్యమట.

పెళ్ళి చూపులకి అబ్బాయి, అతని తల్లి దండ్రులూ, అక్కయ్యా వచ్చారు. బాగా ముస్తాబు చేసి వాళ్ళెదురుగా కూచో బెట్టారు. నా ప్రక్కనే లత కూడా కూర్చుంది. పెళ్ళి చూపుల తర్వాత అబ్బాయి ఎవరో మిత్రుని వద్దకెళ్ళొస్తానని వెళ్ళాడు. నేనూ లతా లోపలికెళ్ళాము. ఆ పెళ్లివాళ్లు అమ్మా, నాన్నలతో కబుర్లలోకి దిగారు. " అమ్మాయి మా వాడికంటె పెద్దదిలా వుంధండీ. ఈడులో తేడా కొట్టొచ్చి నట్లు కనబడుతుంది " అంటూ అబ్బాయిగారి అక్కయ్య మొదలెట్టింది.

" పోనీ చిన్నమ్మాయినే మాట్లాడు కుందాంలేవే వాళ్ళకిష్టమైతే " అని వాళ్ళమ్మగారనడంతో ప్రక్కగదిలో నేను లత ఎదురుగా అవాక్కయిపోయాను.

అమ్మ కల్పించుకొని "పెద్ద దాన్నట్టే వుంచి చిన్నమ్మాయికెలా జరిపిస్తామండీ" అంది. ఆపైన వాళ్లు కట్నాలు, కానుకలూ బేరసారాలూ కాకుండానే కాసేపు ముక్తసరిగా మాట్లాడి సెలవు పుచ్చుకొన్నారు. నా పరిస్థితి తెలుసుకొని నాకు ఏడ్వాలో నవ్వాలో బోధపడ్లేదు. లత కూడా బెంబేలుపడి "ఇంకెప్పుడూ పెళ్ళి చూపుల జోలికే పోవద్దక్కా" అంది బాధగా. "వుద్యోగం చేస్తున్నదానివి కాబట్టి ఎవరైనా మంచి మనిషి తటస్థప గప్ చిప్ గా పెండ్లి చేసేసుకో. ఈ రాద్ధాంతమంతా లేకుండా పోతుంది." అని మోహనరావుగారి ఫక్కీలో ఓసలహా కూడా పారేసింది. "చెప్పినంత సులభం కాదే అది" అన్నా న్నేను మరేమీ చెప్పలేక.

నా ఆలోచన లెంతసేపూ నాన్న అమ్మా కుటుంబం, వంశం చుట్టూ పరిభ్రమిస్తు వుంటాయి. మా అక్కయ్యకో మరిదో, లేక వదినకో అన్నయ్యో వుండి వుంటే బావుండేది నా పాలిటికి. కాని ఆ భాగ్యానికి కూడా నోచుకోలేదు. నేను ఈ విధంగా తలపోసిన రోజులుకూడా ఎన్నోవున్నాయి. అలాగే రోజులు గడుస్తూవున్నాయి. రోజులు గడిచేకొద్దీ అమ్మా నాన్నలకు నేను రొమ్ములమీద కుంపటి, లత తలమీద బరువులా వుండ సాగాము. ఈలోగా లత పరీక్షలు వ్రాసేసింది. తర్వాత వారానికే ఓరోజు లత తన స్నేహితురాలికి పుస్తకాలిచ్చి వస్తానని చెప్పి ప్రొద్దుననగా వెళ్లింది. నేను సాయంత్రం ఆఫీసునుండి తిరిగొచ్చేక కూడా యింటికి రాలేదు.

ఆరోజు నాన్నకూడా యింటికి రాలేదు. నేను టేబిలు సొరుగులో వానిటీ బ్యాగు వుంచుదామని తెరిచాను. పొడుగ్గా పరీక్ష పేపరు మడతలో ఓ కాగితం కనబడింది. అనాలోచితం గానే దాన్ని చేతిలోనికి తీసుకుని మడత విప్పాను. "ప్రియమైన మాధవి అక్కయ్యకు" అని మొదలుపెట్టబడి వుంది. తడబడుతూ ఆత్రంగా సాంతం చదవసాగాను.

"అక్కయ్యా ! నా చిన్నతనంనుండి మన కుటుంబ పరిస్థితులు గమనిస్తు వచ్చాను. పదెనిమిదేళ్లుగా నీ పెళ్ళికి నాన్నగారు చేసే ప్రయత్నాల్తో నాకే విసుగెత్తింది. భగవంతుడు నీకంత ఓర్పు ఎందుకిచ్చాడో ! నీ ఓర్పే నీకు తీరని దౌర్బల్యాన్ని తెచ్చిపెట్టి నిన్ను యినుప సంకెళ్లతో బంధించింది. ఈరోజుల్లో నాన్నగారు చేసే ప్రయత్నాలతో మనకు పెళ్ళిళ్లు జరుగుతాయనే నమ్మకం నాకులేదు. కాబట్టే మా కాలేజిలో రఘురామ్ అనే బోటనీ డిమాన్‌స్ట్రేటరును ప్రేమించాను. గతవారం మ్యాటినీకి వెళ్లొస్తానని నీకు వుదయమే చెప్పాను. ఆ రోజు మధ్యాహ్నం రిజిస్ట్రారు ఆఫీసులో మా వివాహం జరుపుకొన్నాం. ఈ వారంలో ఆయనకు ట్రాన్స్‌ఫర్ వచ్చింది. ఈ దినం మధ్యాహ్నమే వెళ్ళిపోతున్నాం.

నేను ప్రేమ భ్రమలో మోసపోయానని తలంచవద్దు. ఆయనను గత మూడేళ్లుగా గమనిస్తు వచ్చాను. ఎదుటి వారి వ్యక్తిత్వాలను గౌరవించే సుగుణం ఆయనలో వుంది. ఈనాటి వివాహ వ్యవస్థ మీద నాకున్న భావాలే ఆయనకూ

వున్నాయి. ఆయన సాహచర్యంలో నాభవిష్యత్తును ధైర్య, స్థైర్యాలతో తీర్చి దిద్దుకోగలననే నమ్మకం నాకుంది.

కట్నాలూ, కానుకలూ, ఆచారాలూ, సాంప్రదాయాలూ మొదలైనవాటి వూబిలో కూరుకుపోయిన నాన్న, అమ్మ మన జీవితాల్ని ఏ విధంగా పరిష్కరించగలరు? అనేది ప్రశ్నగానే మిగిలిపోతుంది. అందుకు నువ్వే ప్రత్యక్ష నిదర్శనం. నేను నీలా ఎల్లకాలం బేలగా, సమాజ చదరంగంలో ఆట పావుగా వుండలేను. నానిర్ణయాన్ని హర్షిస్తావో, నిరసిస్తావో నీకే వదుల్తున్నాను. నా గురించి బెంగపెట్టుకోవద్దని అమ్మా నాన్నలను ఓదార్చు. వాళ్ల నెత్తిమీది బరువు తొలగినందుకు సంతోషించమని చెప్పు" అని ముగించింది.

అపశ్రుతికి ఆలవాలమై మోడువారబట్టిన నాజీవితాన్ని లత వెక్కిరించి వెళ్లినట్లైంది.

-***-

# రికమెండేషన్

ఎండా కాలపు ఎండల్లా ఆ రోజు కూడా ఆ వూళ్ళో ఎండ జోరుగా కాస్తున్నది.

అయినా పిండిమర సుబ్బయ్య పట్టుదల సడలకుండా కొడుకు రంగనాథాన్ని వెంటబెట్టుకొని కోట పాలెం వెడుతున్నాడు. తన కవసరమైన పని అతి ముఖ్యమైనది. కొడుక్కి వుద్యోగం సంపాదించే ప్రయత్నంలో మహానంది నాయుడు గారిని కలుసుకోవడానికి వెడుతున్నాడు.

ప్రొద్దున్నే పొరుగింటి ప్లీడరు గుమాస్తా నారాయణ పుణ్యమా అని అడ్వొకేటు కామేశ్వర రావుగారి నుంచి కోట పాలెం నాయుడుగారికి బలమైన రికమెండేషన్ లెటరు దొరికింది. ఆ నాయుడుగారు పేరు మోసిన కాంట్రాక్టరు. హైదరాబాదు వరకూ మంచి పలుకుబడి వున్నవాడు. ఆయన కామేశ్వర రావుగారి క్లయింటు. గనక తన కుమారునికి ఇన్సూరెన్సు ఆఫీసులో అసిస్టెంటు పోస్టుకి వచ్చిన ఇంటర్వ్యూ

యీ రికమండేషన్ లెటరు ద్వారా సార్థకమవుతుంది. అని సుబ్బయ్య ప్రగాఢ విశ్వాసం. ఎట్లాగయినా ఆ పోష్టింగు రంగనాథానికి వేయించుకోవాలనే పట్టుదల ఎర్రటి ఎండలో సుబ్బయ్యను రెండు మైళ్ళు నడిపిస్తున్నది. అక్కడికి రోడ్డు గతుకులతో నిండి, మధ్యలో కల్వర్టు శాశ్వత రిపేరులో నున్నందున రిక్షావాళ్ళెవళ్ళూ ఈ మధ్యన పాలెం రామం టున్నారు. కామేశ్వరరావుగారింటినుంచి ఉదయం పదిన్నరకి బయలు దేరిన సుబ్బయ్య అవసరాన్ని మించి డబ్బు లేనందున పాలెంకు నడకనే సాగిస్తున్నాడు.

బి. య్యే. పార్టు బై పార్టు గత అక్టోబరులో కంప్లీటు చేసిన రంగనాథం సుబ్బయ్య పెద్ద కొడుకు. వాని కేదో ఓ విధంగా వుద్యోగం దొరికించుకొంటే తన బరువు తగ్గుతుందని సుబ్బయ్య తాపత్రయమంతాను. కొడుకు ఇంటర్లో చేరినప్పుడే తనే స్వయంగా జిల్లా ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజికి పిలుచుకు పోయి పేరు నమోదు చేయించాడు. సీనియారిటీ వుండబట్టి యిప్పటికి యీ ఇంటర్వ్యూ వచ్చింది. అదీ ఎల్లైసీ డివిజనలాఫీసులో. ఆ ఆఫీసు ఆవూరిలో క్రొత్తగా తెరిచారు. ఈ వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని సుబ్బయ్య తాపత్రయపడిపోతున్నాడు.

పదకొండున్నరకి నాయుడుగారిల్లు చేరుకున్నారిద్దరూ. ఆయన ఇంట్లోలేరు. పొలం మీదకి పోయివున్నందున భోజనానికి రాగలరని రూఢి పర్చుకొని, అక్కడే పడిగాపున్నారు.

ఆయనొచ్చేసరికి ఒంటిగంటన్నరయింది. సుబ్బయ్య యెదురేగి నమస్కార బాణంతో సహా కామేశ్వరరావుగారి లెటరందించా డాయనకి. రెండింటినీ స్వీకరించి వాళ్ళని వరండాలో కూచో బెట్టి, స్నాన భోజనాదులు ముగించుకొనివచ్చి వాళ్ళ యెదుటే లెటరు చదివి రంగనాథం వైపు చూసి "అబ్బాయి యీతడేనా" అన్నాడు. రంగనాథం "మ రే న ం డి" అంటూ వినయం ప్రదర్శించాడు.

నాయుడుగారు రెండు నిమిషాలు ఆలోచనా సముద్రంలో మునిగి తర్వాత "మన టవున్‌లోకి క్రొత్తగా వచ్చిన గవర్నమెంటు డాక్టరు విఠలరావుగారు లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ డాక్టరుకూడా. ఆయన హైద్రాబాదు నుంచే వచ్చారు. ఆయనకి ఇన్సూరెన్సు హెడ్డాఫీసులో చాలా మంది తెలుసు. ఆయనకి లెటరిస్తా మీపని జరిగిపోతుంది." అన్జెప్పి వాళ్ళబ్బాయిని కేకేసి లెటర్ ప్యాడూ, కలమూ తెప్పించాడు. తన లాయరు వ్రాసిన వాక్యాలనే తానూ వ్రాస్తూ సుబ్బయ్యనూ. రంగనాథంనూ తన స్వంతమనుష్యుల్లా భావించి పని సానుకూలం చెయ్యాలని మరీ వ్రాశాడు. దాన్ని కవర్లోపెట్టి విలాసంగా డాక్టరుగారి విలాసం వ్రాసి, అతికించి, ఛలోసాతో కూడుకొన్న చిరునవ్వుతో బాటు ఆ కవరన్దించాడు.

సుబ్బయ్య మనసులో ఆశ చిగురించింది. ఈ ఉద్యోగ మవుతే తమరి మేలు మరువలేమని మరీ మరీ చెప్పుకొని సెలవు పుచ్చుకొని తిరుగుముఖం పట్టారు.

ఎండ నిప్పులు చెరుగుతున్నట్లున్నా వాళ్ళ అవసరం దాన్ని ఖాతరు చెయ్యలేదు. టవున్‌కి మళ్ళీ వచ్చేసరికి మూడున్నరయింది. ఇంటికెళ్తే ఆలస్యమవుతుందని దోవలో అయ్యరు హోటల్లో టిఫిన్ ముగించుకొని డాక్టరు గారింటి కొచ్చేశారు.

డాక్టర్ విఠలరావు భోజనానంతరం విశ్రాంతి ముగింపు ఘట్టంలో వున్నారు. నాలుగింటికి నిద్రలేచి సాయంకృత్యాలు ముగించుకొని, డ్రెస్ చేసుకొని, టెన్నిస్ రాకెట్ చేతబట్టు కొని కాంపౌండులోని కొచ్చాడు స్కూటర్ స్టార్ట్ చెయ్యటానికి.

సుబ్బయ్యా, రంగనాథం గేటు తోసుకొని లోపలి కొచ్చి ఆయన కెదురై నమస్కరించారు. ఆయన ఏమిటన్నట్టు చూడగా సుబ్బయ్య నాయుడుగారిచ్చిన లెటరందించాడు. అక్కడికక్కడే దాన్ని చదివిన డాక్టరు వాళ్ళని లోపలికి తీసి కెళ్ళి డ్రాయింగ్ రూంలో కూచోబెట్టి "ఈ కుర్రాడి కేనా ఉద్యోగం" అని పరామర్శించి, క్వాలిఫికేషనూ వగైరా కూపీలాగి మళ్ళీ సుబ్బయ్యతో "చూడండి సుబ్బయ్యగారూ ఎల్లైసీ హెడ్డాఫీసులో నాకెవరూ డైరక్టుగా తెలీదు. అయినా మా నాయుడుగారు మిమ్మల్ని నాకప్పగించారు. గనుక మీకు తప్పకుండా పనయ్యేట్టు చూస్తాను. మనూళ్ళో ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేటుగా వచ్చారే వెంకట్రావుగారు. ఆయనకి లెటరిస్తా పట్టుకెళ్ళండి. ఆయనకి కొందరు డైరెక్టర్లుకూడా తెలుసు. మీకు తప్పకుండా పని జరుగుతుందని తన లెటర్ హెడ్ నుంచి

ఓ కాగితంలాగి గ్రీనింకు పెన్నుతో అందంగా ముత్యాల్లాంటి అక్షరాల్తో మేజిస్ట్రేటు వెంకట్రావుగారికి లెటర్ ముగించి కవర్లో వుంచి చక్కగా అతికించి అందించాడు.

సుబ్బయ్య మనస్సులో ఆశాలత మొగ్గ తొడిగింది. డాక్టరుగారికి నమస్కరించి బయటికొచ్చారు. మెజిస్ట్రేటుగా రయిదింటి వరకూ కోర్టులో వుంటాగుగనక వాళ్ళిద్దరూ యింటికొచ్చేశారు. కాస్త మజ్జిగన్నం తిని తెరపిన పడ్డారు.

కాసేపిట్లో కూర్చుని అయిదున్నరకి మేజిస్ట్రేటు గారింటి కెళ్ళారు. అప్పటికీ టైం అయిదున్నరయింది. మేజిస్ట్రేటుగారి బంగళా వరండాలో బంట్రోతున్నాడు. కొడుకుతో బాటు సుబ్బయ్య లోనికెళ్ళి అయ్యగారితో మాట్లాడాలని బంట్రోతుకు చెప్పాడు.

దేన్ని గురించి మాట్లాడాలో తెలుసుకున్న మీదట బంట్రోతు వాళ్లను ప్రక్కనేవున్న బెంచీమీద కూర్చోమన్నాడు. అయ్యగారి కోసం కాచుకూర్చున్నారిద్దరూ.

కాలం గడుస్తూ వున్నది. ఆరు ముప్పావయింది. దీపాలు వెలగడం కూడా అయింది. అప్పటికి వెంకట్రావుగారు స్నానమూ, సాయంకాలపూజా ముగించుకొని, తెమిలి బయట కొచ్చారు. అయ్యగారొస్తున్నారనే బంట్రోతు సైగతో యిద్దరూ లేచి నిలబడ్డారు. ఆయన్ని చూసి నమస్కరించారు.

"ఎవరూ? ఏం కావాలి?" అనే ప్రశ్నాద్వయాన్ని వినిపించారాయన. సుబ్బయ్య సమాధానంగా డాక్టరిచ్చిన

కవరందించాడు. ఆయన దాన్నందుకొని పూర్తిగా చదువుకొని ఈజీ ఛేర్‌లో కూచుని వాళ్ళనీ బెంచీ మీద కూచోమన్నాడు.

మళ్ళీ సుబ్బయ్య వైపు చూసి వెంకట్రావుగారు "రేపీ యింటర్వ్యూకి హైద్రాబాదువాళ్ళెవరూ రావటం లేదంట. సెలక్షన్ కమిటీలో ఎవరెవరున్నారో యింకా తెలీలేదు. ఎవరున్నా ఫర్వాలేదనుకోండి మీ పనయ్యేలా చూస్తాను" అని బంట్రోతుతో కాగితమూ, కలమూ తెప్పించి అన్ని వివరాల్తోటి లెటరు ముగించి సుబ్బయ్యకిస్తూ, "మనూళ్ళో అడ్వొకేటు కామేశ్వరరావుగారికి మంచి పలుకుబడి వుంది. ఆయనెట్లాగైనా ఆ కమిటీ మెంబర్లని పట్టెయ్యగలడు. మీ పని నా స్వంత పనిగా ఆయనకి అప్పజెపుతూ వ్రాశాను" ఇలా అంటూ వుండగా సుబ్బయ్య ముఖంలో రంగులు మారిపోసాగాయి. అతని మనసులో ఆశ వెలిసి పోయింది. మేజిస్ట్రేటుగారి చేతినుంచి రికమండేషన్ లెటర్లు నాలుగు తన చేతిలో పడేటప్పటికి డాక్టరింటివద్ద మొగ్గదొడిగిన సుబ్బయ్య మనసులోని ఆశాలత పుష్పించకుండానే ఆ వరండా లోనే వాడిపోయింది. రంగనాథం అయోమయంగా చూస్తున్నాడు. మేజిస్ట్రేటుగారి వద్ద ఎట్టకేలకు సెలవు పుచ్చుకొని యిద్దరూ బయటపడ్డారు.

దార్లో సుబ్బయ్య "ఒరే రంగా రేపట్నుంచీ నువ్వొండిమరకి వచ్చేసెయ్" అంటూ కవర్ని నాలుగు ముక్కలు చేసి రికమండేషన్ని గాలికి వదిలాడు.

# జీవన విపర్యయం

రాజయ్య మళ్ళీ జైల్లోకొచ్చాడు. ఈ సారి మూణ్ణెల్లు మాత్రమే శిక్ష. నేరం ఓ పెద్దమనిషిని చితకదన్ని నూట పాతిక రూపాయల పర్సు లాక్కోవడమే. అతడాపని ఎటువంటి పరిస్థితుల్లో చేశాడో అతనికొక్కనికే తెలుసు.

సామాన్య సామాజికుడుగా వుండాలని రాజయ్య చేసిన ప్రయత్నాలన్నిటినీ సమాజమే త్రోసిపుచ్చింది. అదివరకు తానుచేసిన చిన్నా, పెద్దా రకరకాల నేరాలకి జైలుజీవితం చవిచూచాడు. ఒక దోపిడీ నేరానికి మూడేండ్ల జైలుశిక్ష అనుభవించినప్పుడు, అతని జీవనగతి మార్పును కోరింది. అప్పట్లో జైల్లోవున్నప్పుడు రాజయ్య కాయం కష్టపడ్డం నేర్చుకొంది. చిందర వందరగావున్న జైలు ఆవరణనంతా చెత్తా చెదారం ఏరేసి శుభ్రం చేశాడు. జైలరుగారికి విన్నవించుకొని మల్లె, జాజి, గన్నేరు మొదలయిన పూల మొక్కల్ని తెప్పించి అనువైనచోటల్లా నాటాడు. అవన్ని బాగా పెరగడానికి పాదులుతీసి, నీరుపోసి ఎంతో జాగ్రత్త తీసుకొన్నాడు. జైలరూ,

వాచర్లూ చెప్పే పనులన్నీ అలసటలేకుండా ఓపిగ్గా చేసేడు. ఖైదీల్లో ఎవరికి కన్ను నొచ్చినా, కాలు నొచ్చినా వాళ్ళకు స్వయంగా అన్ని సపర్యలూ చేసేవాడు. జైలువాళ్లు వేసే సంకటిముద్దో గంజో సేవిస్తూ తిండికి తడుముకోవాల్సిన గతి తప్పినందుకు రాజయ్య మనస్సుకు హాయి లభించింది.

మూడేండ్లశిక్ష పూర్తికాగానే రాజయ్య విడుదల సందర్భములో జైలరు పాతిక రూపాయలతని చేతిలో వుంచుతూ " రాజయ్యా ! దీర్ఘకాలం జైలు జీవితాన్ని రుచిచూచావు. మళ్ళీ బయటి ప్రపంచంలో కెల్తున్నావు. ఏదైనా పనీ, పాటా చూసుకొని బుద్ధిగా బతుకు. మళ్ళీ యే వెధవపనీ చెయ్యబోకు " అని సాధారణంగా విడుదలయ్యే ఖైదీలకు చెప్పినట్లుగానే హితబోధచేసి రాజయ్యను జైలుగోడలనుంచి బయటికి పంపేశాడు.

ఉత్తపుణ్యానికే జైలరు పాతికరూపాయలిచ్చినందుకు రాజయ్య కెంతగానో ఆశ్చర్యమేసింది. తానెంత చాకిరి చేశానో గుర్తించలేకపోయాడు. బయటికొచ్చాక రోడ్డుమీదపడి వెనక్కితిరిగి వున్నతంగావున్న జైలుగోడలకేసి పారచూసి స్వేచ్ఛగా వూపిరిపీల్చాడు. నెమ్మదిగా దారిపట్టాడు చేతిలోని రెండు పసులూ ఒక అయిదూ నోట్లను రొంటిన దోపుకొని.

నడవగా, నడవగా, నడవగా రాజయ్యకు ఎక్కడికి పోవాలో, యేం చెయ్యాలో తోచలేదు. చిన్నతనంలోనే తల్లి

చనిపోయింది. పదేళ్ళవాడయ్యాక అబ్బకూడా గతించాడు. అప్పట్నుంచి రాజయ్య జులాయిగా తిరుగుతుండేవాడు. ఆకలేసినప్పుడు హోటల్‌లో కెళ్ళి దర్జాగా కావలసినవన్నీ తినేసి సర్వరిచ్చినబిల్లు నలిపి టేబిలు ప్రక్కగాపడేసి, కౌంటరు దగ్గర జనం క్రిక్కిరిసి వున్నప్పుడు గుంపులో గోవిందా అనుకుంటూ బయటికి జారుకునేవాడు. అడపాదడపా కనుక్కున్న సమయాల్లో నాలుగు తన్నులుతిని బయట పడుతుండేవాడు. కడుపులో మేత పడ్డంతర్వాత తన్నులు తగిలినా ఖాతరు చేసేవాడుకాదు!

బట్టల అవసరంకూడా తేలిగ్గా తీరిపోతుండేది రాజయ్యకు. అరుబయల్లోనో, పెరట్లోనో వుతికి ఆరేసిన బట్టల్ని ఎవరూ చూడకుండా మడిచి చంకలో వుంచుకొని వుడాయిస్తుండేవాడు. తనకు సరిపడ్డవాటిని తొడుక్కుంటూ మిగిలినవాటిని మార్కెట్‌లో మారుబేరగానికి పావలాకో, అర్ధకో యిచ్చేసేవాడు. నిద్రకు రామస్వామిగుడి ఆవరణో, ముత్తెమ్మ సత్రవో చూసుకునేవాడు.

అలా ముచ్చటగా మూడు జీవితావసరాలను తీర్చుకుంటూ పెరుగుతూ పెద్దవుతూ వుండగా రాజయ్యకు, శీను, సూర్యం అనే యిద్దరు బంధువులు తనలాంటివాళ్లే జతయ్యారు. వాళ్ళు ముగ్గురూ సినిమాహాళ్ళ దగ్గిరా రైలు స్టేషన్లో, బస్టాండులో, పిక్ పాకెట్లు మొదలు యిళ్ళకు కన్నాలు వేయడం, తాళాలు లాఘవంగా తీయడం, చేతులకందినంత డబ్బు నగలూ, నట్రా పట్టుకెళ్ళడంవంటి పనుల్లో ఆరితేరారు.

కాలం గడుస్తుండగా ఓరోజు అర్ధరాత్రి సేఠ్ చిమన్ లాల్ యింట్లోపడి ముగ్గురూ బీరువా తెరిచి కరెన్సీ నోట్లను నగల్ని దోచుకొని వెళ్ళారు. నోట్లు శీనూ సూర్యం తీసుకొని నగలు రాజయ్యకిచ్చి వాళ్ళిద్దరూ భాగ్యనగరం చేరుకొన్నారు. తర్వాత వారానికి రాజయ్య డబ్బవసరమై ఒక నగను షరాబుఅంగడిలో అమ్మబోయాడు. రాజయ్య కన్నుగప్పి షరాబు సేఠ్ చిమన్‌లాల్‌కు ఫోన్ చేశాడు. చిమన్‌లాల్ పోలీసుల్తో సహావచ్చి రాజయ్యను పట్టించాడు. నగలన్నింటితో సహా మొత్తం దొంగతనమంతా రాజయ్యమీదే పడింది. అదివరకు తేలని దొంగతనాల కేసులెన్నో రాజయ్యపైనే పోలీసులు బనాయించారు. కోర్టులో విచారణ పూర్తయి రాజయ్యకు మూడేండ్ల శిక్ష పడింది. ఆ మూడేండ్ల శిక్షా కాలంలోనే రాజయ్యకు పనిమార్పూ దాంతోటే బుద్ధిమార్పు కలిగాయి.

జైలునుండి బయటపడ్డ రాజయ్య అటూ ఇటూ తిరిగి హోటల్లో భోంచేసి తన పూర్వపద్ధతికి విరుద్ధంగా కౌంటర్లో బిల్లు చెల్లించి రోడ్డెక్కాడు. బట్టలకొట్టుకెళ్ళి ఓజత కాలరు బనియన్లూ, రెండడ్డపంచెలూ ఒక చిన్నసంచీ కొన్నాడు. చేతిలో ఆరు రూపాయలా పావలా మిగిలింది. ఏదోఒకపని చేసుకొని బ్రతకాలనుకొన్నాడు, యికమీదట. పనికోసం ఆలోచనచేసుకొంటూ ఒక బట్టలకొట్టుకెళ్లి యజమానిని అడిగాడు తనని పనిలో వుంచుకోమని. "వున్న వాళ్ళతోనే వేగ

లేక చస్తుంటే పైగా నువ్వొకడివా " అంటూ పనీలేదుగినీలేదు పొమ్మన్నాడు కొట్టు యజమాని. సరే ఆకొట్లో పనిలేకపోతే లోకము గొడ్డుపోయిందా అని ముందుకు సాగాడు రాజయ్య. రకరకాల దుకాణాల్లో పనికోసం వాకబు చేశాడు. ఎక్కడా తనకు పని దొరికే అవకాశం కనిపించలేదు. ఎన్నో ఇళ్ళ, వాళ్ళను తనను పనిమనిషిగా పెట్టుకోమని ప్రాధేయ పడ్డాడు కాని రాజయ్యకు ఎక్కే గడపా దిగే గడపా పెరగడమేగాని ప్రయత్నంఫలించలేదు. చేతిలోని పైసలన్నీ అయిపోయినయ్. బస్టాండులో పెట్టెలు మూటలు వంటి లగేజి మోసేందుకు వెళ్ళాడు. అక్కడ అదివరకే వుంటున్న లైసెన్సు కూలీలు రాజయ్యకు ఒక్క తలమోతకూడా దక్కనియ్యలేదు. పైగా " ఎక్కడోడివిరా, మాకు పోటీకొచ్చావ్. ఈచాయల వుండకు ఫో " అని కసిరి తరిమికొట్టారు. జీవితంలోని చేదురుచి రాజయ్య జీర్ణకోశాన్ని తడిమి చూడసాగింది.

పంపునీళ్లు గి పొట్ట నింపుకున్నా ఆకలిని జయించలేక పోయాడు. రాజయ్య చివరికి యాచన మొదలెట్టాడు. అందులోనూ ఎదురుదెబ్బలే. బజార్లో పైసలడుక్కుంటె " దేవరదున్నలావున్నావ్ ఏదైనా పన్జేసు కొని బ్రతకలేవూ" అని కసిరే వాళ్ళే కనిపించారు. ఇండ్లదగ్గర పట్టెడన్నం పెట్టండని గొంతులో ఆవేదనా ఆర్ద్రతా మిళితమయ్యేటట్లు అడుకున్నా " దున్నలా వుంటావ్ పనిపాటా చేసుకోకుండా యిదేంపని " అని విసుక్కునే వాళ్ళెక్కువగా తటస్థించారు.

మనిషిగా మారిన రాజయ్యకు "అవును దున్నలావున్నాను. ఈ దున్న మెడమీద కాడిపెట్టి పని చేయించే నాథుడు కరవయ్యాడే" అని రాజయ్య మనస్సు మూగగా మూలిగేది. ఎవరైనా తప్పి, జారీ నాలుగు మెతుకులు రాలిస్తే సగమాకలి కూడా తీరేదికాదు. అలాంటి పరిస్థితుల్లో రాజయ్య నిశ్చయానికి పట్టుతప్పింది. పాత జీవితం మళ్ళీ తన మనసుని తట్టి లేప సాగింది. ఆత్మారాముణ్ణి, యెంత నిగ్రహించుకున్నా ఆవురావురనే పేగులను సమాధానపర్చలేని రాజయ్యా మళ్ళీ పాతమనిషై పోయాడు. ఫలితం మరోసారి చట్టానికి లొంగాల్సొచ్చింది. కాని యీనేర పరిమితి మూణ్ణెళ్ళ ఖైదుకే తృప్తిపడింది.

జైల్లో రోజులు గడపగా రాజయ్యకు జైలుజీవితమే మేలనిపించింది. ప్రశాంతంగా వుంటున్నాడు. జైలు వాళ్ళు పెట్టే అందమగుల తిండితోనైనా ఎత్తయిన ఆవాలుగోడల మధ్య తిండికి తాపత్రయంలేదు. శరీర కష్టానికి పోటీలేదు. బయట సువిశాల ప్రపంచంలో తిండికీ కటకటే, పనికీ కటకటే. రోజులు గడిచేకొద్దీ శిక్షాకాలం తగ్గసాగింది. శిక్షాకాలం తగ్గేకొద్దీ రాజయ్యా గుండె గుభిల్లుమంటున్నది. ఎలాఅయితేనేం రాజయ్యను క్షణంకూడా లోపలుంచుకోవలసిన అవసరం తీరిపోయింది జైలుకి. ఆరోజు జైలరుబాబు నెంతో ప్రాధేయపడ్డాడు రాజయ్య తనక్కడే వుంటానంటూ. కాని అది జైలరు బాబు సొంతయిల్లేంకాదు వుండమనడానికి. జైలరుబాబు

కాళ్ళనంటిపడి వున్న రాజయ్యను సెంట్రీలు రెక్కలు పుచ్చుకొని పైకి లేపారు. ఈసారి జైలరు ఓ అయిదు రూపాయల నోటును రాజయ్య చేతిలో వుంచారు. విధిలేక అంతఃపురంలో నుంచి గెంటివేయబడ్డ రాజులా బయటపడ్డాడు రాజయ్య.

ఏవిధంగానూ తననాదుకోలేని సమాజం మధ్య తన బ్రతుకెంతో యిరుగ్గావున్నట్టు అనుభూతి చెందాడు. చేతిలోని అయిదూ అయిపోవడానికెంతో సేపు పట్టదు. అదికాస్తా అయిపోగానే యెదురయ్యే పరిస్థితుల్ని వూహించగా రాజయ్య వొళ్ళంతా పిడచగట్టుకొనిపోయినట్లయింది. అయినా నింపాదిగా నిలదొక్కుకుని తాను ప్రశాంతంగా వుండేచోటనే శాశ్వతంగా వుండిపోవాలనే దృఢనిశ్చయానికొచ్చేశాడు. అందుకు అనువైన అవకాశం ఏవిధంగా లభిస్తుందా అని ఆలోచిస్తూ రోడ్డుమీద నడుస్తున్నాడు. ఒక చోట ఫుట్ పాత్ మీద ఇరానీవాళ్లు రకరకముల కత్తులూ, కత్తిపీటలూ, వుంచుకొని అమ్ముతున్నారు. అది చూసి రాజయ్య తనకు నచ్చిన కత్తిని మూడుంబావలాకు కొని బాగా పదును పెట్టించాడు. దాన్ని బొడ్లో దోపుకుని బయల్దేరాడు. అదివరకు పిక్ పాకెట్లకు ఆశ్రయమిచ్చిన స్టేట్ బ్యాంకి దగ్గర నిలబడ్డాడు. ఓ పెద్దమనిషి కరెన్సీ సంచితో బ్యాంకులోపలికి పోతుండగా అతని జబ్బ పట్టుకుని కత్తితో పొడిచి ఆ తర్వాత డబ్బుసంచి లాక్కున్నాడు. రాజయ్య ప్రయత్న పూర్వకంగా చేసిన యీ పనిని వస్తూ పోతున్న వాళ్ళంతా చోద్యంలాగా

చూస్తుండగా నలుగురు చొరవ తీసుకొని రాజయ్యను పట్టుకొన్నారు. అంతలో బ్యాంకునుండి ఫోను అందగా పోలీసులొచ్చి రాజయ్యను స్టేషనుకు, గాయపడ్డ వాణ్ణి ఆసుపత్రికీ చేర్చారు.

రాజయ్యపై ఖూనీ ప్రయత్నమూ, దొంగతనమూ మోపబడినాయి. కళ్ళున్న మనుషుల సాక్ష్యంతో చెవులున్న న్యాయస్థానం విధించిన వరంలాంటి దీర్ఘకాలిక శిక్షను అనుభవించడానికి రాజమండ్రి వెళ్ళాడు జీవన విపర్యయానికీ ప్రతీక అయిన రాజయ్య.

# బడుగు బ్రతుకు

"ఏయ్ వీరయ్యా, యిలారా" అని రాజారావు పిలవగానే భుజాన వేసుకున్న తువ్వాలుగుడ్డను తలకు చుట్టుకొని వీరయ్య ఆదరా బాదరా లోపలికెళ్ళి చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

రాజారావతని చేతిలో ఓ వందరూపాయల నోటుంచి, ఓ చీటీ యిచ్చి, అందులో రాసున్నవన్నీ త్వరగా తీసుకురమ్మని పంపాడు. "అట్టాగేనయ్యా" అంటూ కిటికీ ప్రక్కనున్న సంచిని తీసుకొని వీరయ్య వీధినపడ్డాడు.

రాత్రి తొమ్మిది దాటుతున్నా యింటికెళ్లే ధ్యాగ్యానికి నోచుకోని వీరయ్య బజారువేపు నడుస్తూ దీప స్తంభం క్రింద నిల్చుని ఆ పూటకి అయ్యగారి అవసరాల చీటిని చూశాడు. "నాల్గు కింగ్‌ఫిషర్ బీరుబాటిళ్లు, స్కాచ్ విస్కీ హాఫ్

బాటిల్, రెండు క్వార్టర్లు జిన్నూ, మూడు ప్లేట్లు మటన్ బిరియాని, చికెన్ సిక్స్టిఫైవ్, ఫిష్ కట్లెట్, ఎగ్ సుపారీ, క్యాషూనట్స్, చిప్సు " అని రాసుంది. అవన్నీ తేవడానికి ముందుకు సాగాడు. ముందుగా వైన్ షాపులో దూరి డ్రింక్స్ అన్నీ పార్శిల్ కట్టించి, దాని తాలూకు చెల్లించిన బిల్లుతో సహా సంచిలో వేసుకొని, హోటల్ ఎవరెస్టుకి బయలు దేరాడు.

దారిలో ఓ మారు యింటికెళ్ళి పెళ్ళాం చేతికి రెండు రూపాయలిచ్చి వద్దామా అని ఆలోచించాడు, ఆ పూట పిల్లలకైనా కనీసం తిండి సమకూర్చాలని. తన యిరవై యేండ్ల సర్వీసులో అలాంటి కక్కుర్తి పనులెప్పుడూ చేయ లేదు. నిజాయితీకోసం పడిచస్తూ కలో, గంజో, తాగుతూ అదీ లేని పూటల్లో పస్తులైనా వుంటూ సేవాధర్మాన్ని నిర్వర్తిస్తున్నాడు. కాని ఆ రోజువరకు యింకా నెల జీతం ముట్టలేదు. వీరయ్య అర్ధాంగి నరసమ్మ అప్పుడప్పుడూ ఏవో కూలి పనులు చేస్తూ కుటుంబ పోషణలో వీరయ్యకి సాయపడతూ వుంటుంది ముగ్గురు పిల్లల తల్లయినా. కానీ నాల్రోజుల్నుంచి వొంట్లో నలతగా వున్నందున పక్కింటి పుల్లమ్మ ఫలానా చోట కూలి దొరుకుద్ది రమ్మన్నా నిస్సత్తువతో నిల్చిపోయింది యింట్లోనే. ఇంట్లో నూకల్లేవు. ఇరుగింట్లో, పొరుగింట్లో నూకలు, జొన్నలు అరువు తెచ్చి పూట గడుపుతూ వుంది నరసమ్మ. ఇక అలాంటి అరువు

కూడా దొరకని రోజుల్లో పడింది వీరయ్య బడుగు బ్రతుకు. అందుకే యీ ఆలోచన వచ్చింది అతనికి. అవసరానికి తలొగ్గుదామనుకున్నా, రావణాసురుడు లాంటి రాజారావుని తల్చుకుంటే వున్న కంటింజంటు వుద్యోగము కూడా వూడి పోతుందనే భయంతో వీరయ్య కాళ్లు అతణ్ణి నేరుగా హోటల్ ఎవరెస్టుకే నడిపించాయి. ఆలూ చిప్సుతో సహా అక్కడ కావలసినవన్నీ కట్టించుకొని బిల్లు రాయించుకొని పైకం చెల్లించాడు. అంతా పోతే మువ్పావలా మిగిలింది. దాంతో పాన్ షాపులో మూడు కిళ్ళీలు కట్టించుకొని ఆఫీసు కొచ్చాడు.

అప్పటికే తన " అయ్యగారి " కెదురుగా నరసింహ మూర్తి, కుమారస్వామీ ఆశీనులై వున్నారు. వీరయ్య లోనికెళ్ళి రాజారావు రీడింగ్ రూములో టేబిలు మీద అన్నీ సర్ది, మూడు కుర్చీలు అమర్చాడు. రాజారావు వద్ద కొచ్చి బిల్లు లన్నీయిచ్చి, " మిగిలిన డబ్బులకి కిళ్ళీలు తెచ్చానయ్యా " అన్నాడు. ' సరే నువ్వు బయటే వుండు ' అని మిత్రులిద్దరితో లోపలికెళ్ళాడు రాజారావు. బయట వరండాలో చతికిలపడ్డాడు. లోపల అయ్యగార్లు ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ జోక్స్ కట్ చేసుకొంటూ లోకాభి రామాయణం చెప్పుకుంటూ డ్రింకులు కలుపుకొని, కాక్ టెయిల్ చేసుకొని రకరకాల తినుబండారాలు నంజుకుంటున్నారు.

వీరయ్యకు తన ఆకలి సంగతి యెట్లున్నా, యింట్లో పిల్లల ఆకలీ, భార్య అనారోగ్యంపైన పడి మనసు కొట్టుకుంటోంది. అయ్యగార్లు తినగా మిగిలిందేమైనా వుంటే మూటకట్టుకెళ్ళి పిల్లలకైనా కనీసం అర్థాకలి తీరుద్దాం అనే ఆశతో కునికిపాట్లు పడుతున్నాడు. అయ్యగార్లు తాగడం, తినడం పూర్తయ్యేసరికి మరో గంటన్నరైనా పట్టుతుంది. పొద్దుట్నుంచి తిండిలేక తనకే కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. ఇక యింట్లో పిల్లలు నేల కరుచుకొని పడివుంటారు. మరో పదిహేను నిమిషాలకి ఓ కుక్క తోక ఆడించుకుంటూ వచ్చి వరండాలో వీరయ్య ప్రక్కనే చేరింది. దాన్ననుసరించి దాని పిల్లలు రెండు కుంయ్, కుంయ్ మంటూ వచ్చాయి. అవెక్కడ లోపల దూరుతాయో అని వీరయ్య "ఛయ్, ఛయ్, ఛో, ఛో" అంటూ వాటినదిలించాడు. అవేమో వరండా దిగి బయల్లో ఒక ప్రక్కగా తిష్ఠవేసుకున్నాయి.

మధ్యాహ్నం అయ్యగారి కారియర్లో కూడా ఏమీ మిగల్లేదు. ఒకవేళ ఎప్పుడైనా కాసిన్ని అన్నంమెతుకులూ, చారునీళ్ళూ మిగిలినా కారియర్ తెచ్చే పనిపిల్లపాలుగావడం తప్ప వీరయ్యకు దక్కడం లేదు. ఎప్పుడైనా అయ్యగారి డ్రింకు పార్టీలో ఏమైనా మిగిల్తే తీసుకెళ్ళేవాడు. ఇప్పుడీ పూటేమైనా మిగిల్తే తీసికెళ్ళి నిద్దరోతున్న పిల్లల్ని లేపి తినిపించాలనుకొన్నాడు.

ఇరవయ్యేళ్ళుగా అదే ఆఫీసులో పనిచేస్తున్న వీరయ్యకి అప్పటికి నలుగురు ఆఫీసర్లు మారారు. రాజారావుకి మల్లే ముందటివాళ్ళూ డ్రింకులూ అవీ తెప్పించుకొనేవాళ్ళే. అయినా ఎవళ్ళూ వీరయ్య చేతిలో చిల్లర డబ్బులు కూడా పెట్టేవాళ్ళు కాదు బక్షీష్‌గా. హోటల్ ఎవరెస్టుకెళ్ళి అయ్యగార్ల తిండి పొట్లాలు తెచ్చే వీరయ్య అందులో ఒక సారి కూడా కనీసపు తిండి తినే అదృష్టం రాలేదు. అక్కడ సర్వర్లకు కస్టమర్ల నుండి బక్షీషులు లభిస్తుండడం ఎన్నో సార్లు చూశాడు. కాని తను రాత్రి ఎంతో ప్రొద్దుపోయిన తర్వాత కూడా అయగార్లకు అన్నీ అమర్చిపెట్టి యెంత సేవ చేసినా పావలా డబ్బు కూడా ముట్టేది కాదు వీరయ్యకు. అయినా బాధ పడేవాడు కాదు. అదంతా తన వుద్యోగధర్మంలో ఒక భాగం అనుకునేవాడు. తమ కడుపులు మాత్రం సుష్టుగా నింపుకొని ఎదుటివాడి కడుపు సంగతి యేమాత్రం ఆలోచించని అయ్యగార్ల అదృష్టానికి వీరయ్య అసూయ పడేవాడు కూడా కాదు.

గంట పదిన్నర దాటింది. మరో అరగంటగ్గానీ లేచేట్టు లేరు వాళ్లు. బయట నాలుగో మానవుడున్నాడనే యింగిత జ్ఞానం ఎవరికీ లేదా ముగ్గుర్లో. అంతస్తుకు, హోదాకు తగదని డ్రింకులో ఓ సుక్కైనా యివ్వకపోయినా "ఒరే వీరా యింద యీ రొట్టెముక్క తిను" అనడానికి కూడా నోరు రాదు అలాంటి వాళ్ళకి. అసలే నాల్గవ తరగతి కంటె క్రింది

వుద్యోగస్థుడైన వీరయ్య యింత చాకిరి చేసినా తన కుటుంబానికి సరిపడే తిండి సమకూర్చలేని ఆదాయం తనది. పూటకి వందరూపాయలైనా ఖర్చు చేసే ఔన్నత్యం అయ్యగారిది. అది చూస్తూ తన స్థితికి తానే జాలిపడ్డం తప్ప యితరులనుండి పిసరంతైనా జాలి పొందలేని హీన మానవుడు వీరయ్య. తన యిరుగు పొరుగువాళ్ళు యించు మించు అలాంటి పరిస్థితుల్లోనే వున్నారు. తమకా రాత బ్రహ్మదేవుడే రాసిపెట్టాడో, సమాజమే రాసిపెట్టిందో ఆలోచించే శక్తి బహుగుబ్రతుకు సాగించే వీరయ్యలాంటి వాళ్ళకు లేదు.

తాణాలో గంట కొట్టారు. రాజారావ్ బ్రేవ్‌మని త్రేన్చుకుంటూ బయటకొచ్చి "ఒరేయ్ వీరా, సీసాలు అవీ తీసేసి, గవంతా శుభ్రంగా తుడిచెయ్" అని ఆర్డరు జారీ చేశాడు. మిగిలిన యిద్దరు కూడా తూలుతూ, సోలుతూ బయటపడ్డారు. వీరయ్య లోపల అన్నీ సర్ది పరిశీలనగా చూశాడు. కనీసం చిప్సు ముక్కలు కూడా మిగిలివుండ లేదు. టేబిలుచుట్టూ క్రింద కూడ అన్నీ నమిలిపారేసిన ఎముకముక్కలే కనబడ్డాయి. అన్నిటినీ యేరి పొట్లాల కాగితాల్లో ఆకుల్లో మడచి దూరంగా పారేశాడు.

కాంపౌండు బయట్లో వుండిన కుక్కా దాని పిల్లలూ వీరయ్య వెంబడే బయటికొచ్చి పారేసిన ఎముకల్ని

కొరుకుతూ కాలక్షేపం చేయసాగాయి. అది గమనించి కనీసం కుక్కగానైనా పుట్టకపోతినే అని వీరయ్య మనస్సు కొద్ది క్షణాలు ఆక్రోశించింది. చేసేది లేక వెనుదిరిగి వచ్చి ఆఫీసు తలుపులూ, కిటికీలు మూసి తాళం వేసి తాళంచెవుల్ని అయ్యగారికిచ్చాడు. అప్పటికే రోడ్డుమీద గూర్ఖా లాఠీ టకటకలాడిస్తూ గస్తీ తిరుగుతున్నాడు.

రాజారావు మిత్ర ద్వయంతో బయలుదేరాడు. వీరయ్య నెమ్మదిగా "అయ్యగారూ, ఓ రెండు రూపాయ లిప్పించండి" అన్నాడు. "ఒరేయ్, సమయం సందర్భం లేకుండా యెప్పుడు పడితేఅప్పుడు అడగడమేనట్రా. యిప్పుడు చిల్లర లేదు తర్వాత చూద్దాంలే, వెళ్ళు. వెళ్ళి ప్రొద్దున్నే యేడింటికే వచ్చేయ్" అంటూ ముందుకు సాగాడు. వీరయ్య కాళ్ళీడ్చుకొంటూ గుడిసె చేరుకొన్నాడు. ఎప్పుడో నిద్రాదేవి అక్కున పడివున్న పిల్లల్ని, భార్యని చూశాడు. తన వేడి నిట్టూర్పులను మాత్రం వాళ్ళకు ప్రసరింపజేయ గలిగాడు. కళ్ళు మూతలు పడుతున్నందున చింకి బొంతను విప్పదీసి పర్చుకొని మేను వాల్చాడు. అంతలో అయిదేళ్ళ కూతురు లేచి కళ్ళునులుముకుంటూ నీ...ళ్ళా .... అంటూ రాగం తీసింది. వీరయ్య నెమ్మదిగా లేచి సొట్టగ్లాసుతో మట్టికుండలో నీళ్ళు తీసుకొని ఆకలితో వున్న ఆ పిల్లనోటికి

బిర్యానీ తెచ్చిన చేతుల్తోనే కేవలం మంచినీళ్ళను మాత్రం అందించాడు. ఆ అమ్మాయి నాన్నను గుర్తించి "నాన్నా ఆకలేస్తోంది" అంటూ పొట్టను చేత్తో పట్టుకొంది. వీరయ్య గొంతులో వొణుకును స్పష్టపడనియకుండా "తెల్లారనీయమ్మా పడుకో" అన్నాడు తన బ్రతుకు తెల్లారుతుందో లేదో తెలీని వీరయ్య.

*
* *

# ఎదురుచూడని వసంతం

అప్పుడే నాలుగుమ్పావు అయింది. అటెండర్ రామయ్యా బెల్ కొట్టాడు.

పిల్లలంతా బిలబిలమంటూ క్లాసుల్లోంచి బయట పడ్డారు. వాళ్ళ వెనకాలే వుపాధ్యాయులంతా వుసూరుమంటూ వీధినపడ్డారు.

సూర్యుని వేడిమితో ప్రాణం నింపుకొనే మనుషులు రోజూ వుదయాన్నే వుత్సాహంగా వుంటారు, తమ తమ విధులు నెరవేర్చుకొంటూ. ప్రొద్దువాటారే గంటల్లో అదే సూర్యుని వేడిమికి వాడిపోయిన మొహాలతో బాటు వుత్సాహమూ వాడిపోతుండగా వాళ్ళ వాళ్ళ విధులనుంచి వుసూరుమంటూ బయటపడుతుంటారు. ఆ వేడాదే మునిసిపల్ హైస్కూల్లో బి. యిడి. పోస్టుకి ప్రొమోట్ అయిన కమల కూడా అందరికిమల్లే వాడిపోయిన మొహంతో బళ్ళోనుంచి రోడ్డెక్కింది. నాలుగు ఫర్లాంగుల దూరంలో వున్న యింటిని నాలుగుమైళ్ళు నడిచివచ్చినట్టు ఫీలవుతూ

చేరుకుంది. తమ్ముడు రాజు రావడానికింకా అరగంట పట్టవచ్చు అనుకొంది. ఈ లోగా కాఫీకి నీళ్ళు పెట్టి కాళ్ళు చేతులు కడుక్కుని కొంత వుపశమనం పొంది స్టవ్ ముందర కూర్చొని కాఫీడికాక్షన్ కలుపుతూ "ఏమైనా యీ రోజు రాజు పెళ్ళి విషయం తేల్చేయాల్సిందే" అని దృఢంగా అనుకొంది. 'వాడు ఇన్‌కంటాక్స్ ఆఫీసులో క్లర్కుగా చేరాక వచ్చిన నాలుగు సంబంధాల్నీ తోసేశాడు. ఇప్పుడీ మార్తాపురం వాళ్ళ సంబంధమైనా ఖాయం చేయించాల్సిందే' కమల గట్టిగా తీర్మానించుకొంది. ఏమైనా తను ఉద్యోగం చేసుకొంటూ యింటిపనంతా కూడా ఒక్కర్తె చేసుకోవాలంటే యిప్పుడు మరీ సాధ్యంగాకుంది. పదమూడేండ్ల సర్వీసు దాటింది తనకి. క్లాసువర్కు, ఇంటిపనీ చూసుకోలేక, చేసుకోలేక సతమతమవుతూ వుంది. ఇట్లో తనకి మరో ఆడతోడు వుండడం ఎంతో అవసరంగా వుంది.

ఆలోచిస్తూ వుండగానే రాజు వచ్చాడు. కాళ్ళు ముఖం కడుక్కొన్నాక కమల కాఫీ అందించింది. తను వస్తూనే యేమీ మాట్లాడకుండా అక్కయ్య గంభీరంగా వుంటే తన పెండ్లి ప్రసక్తికి నాంది అని రాజుకి బాగా తెలుసు. అక్కయ్యంటే రాజుకి తల్లీ, తండ్రీ, మిత్రము, సమస్తమూ. రాజు ఆరేళ్ళవాడుగా వున్నపుడే వాళ్ళమ్మ చనిపోయింది. తర్వాత నాలుగేళ్ళకే రిటైరైన తండ్రి కూడా రాజుని కమలకి వదిలి యీ లోకాన్ని విడిచాడు.

తండ్రి బతికుండగానే కమల సెకండరీ గ్రేడు టీచరుగా వుద్యోగంలో చేరింది. ఆ తర్వాత రాజుకి తను, తనకి రాజు తోడుగా మిగిలిపోయారు. తండ్రి వున్నపుడు తనకి మూడు పెళ్ళి సంబంధాలు వచ్చాయి. కట్నాల బేరం కుదరక అవి వీగిపోయాయి. అయినా తనకి పెళ్ళి చేసుకోవాలని లేదు. తండ్రిని కనిపెట్టుకొని తమ్ముణ్ణి పెంచి పెద్దచేస్తే తన జీవితం సగం పైగా గడచిపోగలదు. అలా అనుకొంటూ వుండగా ఆ తండ్రి దూరమయ్యాడు. ఇక కమల సంకల్పానికి తరుగూ, తిరుగూ లేకుండాపోయింది.

రాజు అక్క పెంపకంలో బి.కామ్. పాసయ్యాడు. ఉద్యోగస్థుడూ అయ్యాడు. అక్కయ్య మీద మెనలేని గౌరవ భావముందతనికి.

నెమ్మదిగా ఆవిడ సంభాషణ మొదలెట్టింది.

"వచ్చే మాఘ మాసంలో నీ పెళ్ళయి పోవాల్సిందే రాజూ."

రాజు అక్క ముఖంలోకి చూస్తూ "ఎప్పుడూ నా పెళ్ళి మాటేగానీ, నీ గురించి ఏమీ చెప్పవేమిటక్కా" అన్నాడు.

"అంటే నా పెళ్ళి గురించి యేమీ చెప్పననా" అన్నది కమల. రాజు పలకలేదు.

" చూడు రాజూ, నాకు ముప్పయి అయిదేండ్లు పైబడి నడి వయస్సు వచ్చేసింది. నా వయస్సిప్పుడు పెళ్ళీడు కాదు. అయినా వృద్ధకన్యకు నాకు పెళ్ళేమిటి? నీవా, పాతిక సంవత్సరాలవాడివి. సమంగా పెళ్ళి చేసుకోవల్సిన వయస్సులో వున్నావు. ఏ వయస్సు కా ముచ్చట జరగాలి. నాకా వయస్సు చెల్లిపోయింది. అందుకే నీకు పదే పదే చెబుతున్నా. "

' అయినా యిప్పుడప్పుడే యేం మించి పోయిందక్కా?'

' నాకు మించిపోయిందయ్యా. ఉద్యోగమూ యింటి పనీ రెండూ చేసుకోలేక ఛస్తున్నా. వయస్సు పైబడే కొద్దీ ఓపిక నశిస్తోంది' ఆమె మాటల్లో విసుగు స్ఫుటంగా ధ్వనించింది.

రాజు అది గమనించాడు.

రాజు ఆలోచించడం చూసి ఆమె వంటింట్లో కెళ్ళింది. అక్కయ్య మాటల్లోని సత్యాన్ని గ్రహించాడు. తనకోసం యెంతో త్యాగం చేసిన అక్కయ్యని సుఖ పెట్టాలని నిశ్చయించుకొన్నాడు. ఆవిడ వంట ప్రయత్నంలో వుందని వీధి తలుపు వారగా వేసి బజార్లో కెళ్ళాడు.

రాత్రి యెనిమిదింటి వరకు తిరిగి తిరిగి యింటికి వచ్చాడు రాజు. భోజనాలయ్యాక అక్కయ్యతో చెప్పేశాడు నీ యిష్టమెట్లో అట్లే కానిమ్మని. ఆ రోజు అంత తేలిగ్గా తమ్ముడు తేల్చి చెప్పేసరికి ఆమె యెంతో వుప్పొంగిపోయింది.

మర్నాడు ప్రొద్దున్నే మాణిక్యపురం వాళ్ళకి ఉత్తరం వ్రాసేసింది, ఫలానా తారీఖున నిశ్చయతాంబూలాలకు వచ్చేస్తున్నామని. కమలకు యిప్పుడెంతో ఉత్సాహంగా వుంది. తమ్ముణ్ణి ఓ యింటివాణ్ణి చేస్తున్నందుకు ఆమె ముఖంలో క్రొత్త వింత తెలిపే దర్పం వెలుగొందుతూ వుంది.

తమ్ముడి పెళ్ళి బాగానే జరిగిపోయింది. తమ వూళ్ళో మళ్ళు పెండ్లి మరీ ఘనంగా చేయించింది. కమల తమ్ముణ్ణి, మరదల్ని చూసుకొని మురిసిపోయింది. అమ్మాయి క్రిష్ణవేణి లక్షణమైన పిల్ల. తమ్మునికి తగిన జోడీ. తనకేం గావాలింక ? వాళ్ళకకలిగే పిల్లల్ని చూసుకొంటూ హాయిగా కాలం గడిపెయ్యొచ్చు.

మరదలు క్రిష్ణవేణి కాపురానికొచ్చిన దగ్గర్నుంచీ తనకి వంట పని తప్పింది. ఆ అమ్మాయి చేసే వంటల్లో లోపాలున్నా కష్టమనిపించలేదు. అడపా దడపా రాజు మరదల్ని కసురుకొంటున్నా సర్ది చెప్పేది తను. అంత మాత్రాన వాళ్ళిదరి మధ్యా అన్యోన్యత చెడలేదు. తనకంతే చాలు.

ఓ రోజు కమల స్కూలునుంచి వచ్చేసరికి క్రిష్ణవేణి తలనొప్పితో పడుకొంది. కమలే కాఫీ కాచి మరదలికిచ్చి, తనూ తాగింది. మరుసటిరోజు ఆ అమ్మాయి కోలుకున్నా "వదినగారూ స్టవ్ వెలిగించి కాఫీ కాయండి. నేను అంట్లన్నీ పనిమనిషికి వప్పజెప్పి వస్తాన" ని పెరట్లోకి దారితీసింది. కాఫీ

అయింది. ఆ అమ్మాయి తనకీ, భర్తకీ చెరొక కప్పులో పోసుకొని హాల్లోకి నడిచింది. అనంతరం వంట తన వంతే అయింది కమలకి.

మెలమెల్లగ యింటిపనంతా చేయడం తనపాలనే పడింది. చేయించడాన్ని కృష్ణవేణి పుచ్చుకుంది. ఓ రోజు కమలకి తలనొప్పి వచ్చి అరగంట పరిష్మన్‌తో యింటికి వచ్చేసింది. క్రిష్ణవేణి యీజీఛెయిర్‌లో కూర్చుని వార పత్రిక చదువుతోంది.

"అమ్మాయ్ తలనొప్పిగా వుంది కాస్త కాఫీ కాయమ్మా" అన్నది కమల.

"నాకూ నడుము నొప్పిగా వుందండీ" అంది ఆ అమ్మాయి వారపత్రిక క్రిందపెట్టి కళ్ళు మూసుకుంటూ.

కమల చేసేది లేక వచ్చేప్పుడు తెచ్చుకొన్న మాత్ర నోట్లో వేసుకొని నీళ్ళు త్రాగి మంచం వాల్చుకొని పడుకొంది.

రాజు కాస్త ఆలశ్యంగా వచ్చాడు. ఇంట్లో వంట చేసిన సూచనల్లేవు. భార్య నడగ్గా-

"నాకేమో నడుము నొప్పిపెడుతోంది. మీ అక్కయ్యకి తలనొప్పిట." అన్నదామె. రాజు బజారు కెళ్ళి డిస్పెన్సరీలో డాక్టరుకు చెప్పి యిద్దరికీ విడివిడిగా మందులు తీసుకొని హోటలు కుర్రాడిచేత హోటలు క్యారియరు, ఫ్లాస్కుతో కాఫీ మోయించుకొచ్చాడు. మరునటి రోజునుంచి మళ్ళీ మామూలుగానే దినచర్య సాగిపోతూ వుంది.

ఆ రోజు స్కూలు యిన్‌స్పెక్షన్ జరుగుతోంది. కమల పొద్దున్నే లేచి త్వరగా ఇంటి పని పూర్తిచేసుకొని స్కూలుకు బయలుదేరింది. గుమ్మం దాటుతుండగా క్రిష్ణవేణి మాటలు వినబడ్డాయి.

"ఏమిటండీ, మీ అక్కయ్య మరీను. జార్జెట్ చీరలు, పాలిస్టర్ చీరలు ధరించి ముసలిమొప్పున వొయ్యారాలు పోతోంది."

కమల మనస్సు కలుక్కుమంది. తను మంచి దుస్తులు కట్టడం మరదలికి గిట్టకపోవడం తెలిసి బాధపడిపోయింది. తనకున్న రాళ్ళగాజులు వేసుకొన్నా, ముత్యాల దుద్దులు పెట్టుకొన్నా ని మొహానికి అవెందుకన్నట్లుండేవి ఆమె చూపులు. చివరికి తను రిస్టువాచి పెట్టుకోవడం కూడా ఆ అమ్మాయికి గిట్టనట్లే ననిపించింది.

ఏమిటీ వైపరీత్యం ? కమల వేదనపడసాగింది. క్రిష్ణవేణి తనని సాటి ఆడదానిగానైనా చూడ్డానికి ఓర్వలేదే అని మధనపడసాగింది. ఏమైనా తను తమ్ముణ్ణి వదిలి వుండలేదు. సర్దుకొనిపోతుంటే సరి అనుకొన్నది.

మరుసటి సంవత్సరం మళ్ళీ యిన్‌స్పెక్షన్ వచ్చింది. శనివారం సాయంకాలం కమలవాళ్ళ హెడ్మాష్టరు యింటికి వచ్చి "కమలగారూ మీరు రేపు స్కూలుకొచ్చి

యిన్‌స్పెక్షన్‌కి అవసరమైన చార్టులు, రిపోర్టులు పూర్తి చేయించాలండీ " అని రిక్వెస్టు చేశాడు. కమల ఎప్పుడూ కాదనదు గనక సరేనని ఆయనకి కాఫీ యిచ్చి పంపించింది.

ప్రొద్దున్నే కమల స్కూలుకి బయలుదేరి పోతుంటె రాజు " యీ రోజు ఆదివారం కదా యెక్కడికి బయలుదేరావు " అని అడిగాడు.

కమల బదులు చెప్పేలోగా " స్కూల్లో బోల్డు పనుందటండీ, నిన్న వాళ్ళ హెడ్మాస్టరు వచ్చి చెప్పివెళ్ళాడు. ఆయన కూడా వస్తాడట లెండి " అన్నది క్రిష్ణవేణి వ్యంగ్యంగా సాగదీస్తూ.

" రేపట్నుంచి మా స్కూల్ యిన్‌స్పెక్షన్ రాజు " అంటూ కమల బయలుదేరింది.

క్రిష్ణవేణి రాజుతో అంటూనే వున్నది. " ఆవిడగారి కోసం యింటిదాకా పెద్దమనుషులు రావడం మొదలయ్యింది. ఇంకా ముందు ముందు యేం జరుగుతుందో "

రాజు ఏం మాట్లాడలేదు.

క్రిష్ణవేణి మాట కమల మనస్సుకు శూలాల్లా గుచ్చుకొన్నాయి. అయినా చేసేదేమీ లేదు. తన జీవితానికంటూ ఓ ధ్యేయం లేకపోయినా మమతాలతను పెంచి పోషించుకొంటూ బ్రతుకుతూ వుంది.

ఫిబ్రవరిలో పాఠశాల వార్షికోత్సవం వచ్చింది. పోటీలో గెలిచిన విద్యార్థులకు యివ్వాల్సిన బహుమతుల కొనుగోలు బాధ్యతను హెడ్మాస్టరు, రాఘవరావు మాస్టారుకూ కమలకీ అప్పచెప్పారు. బజార్లో మూడు నాలుగు షాపులు తిరిగి అవసరమైనవన్నీ కొని తీసికెళ్ళారు చెరో రిక్షా మీద.

తర్వాత రెండో రోజు రాజు అక్కయ్యని నిలదీశాడు. "ఏమిటక్కా నువ్వు ఆ రాఘవరావు మాస్టారుతో కలిసి బజార్లో తిరగడం బాగులేదు. మొన్న మీ యిద్దర్నీ బజార్లో చూసేసరికి నాకు తల కొట్టేసినట్టయ్యింది."

"ఏమిటి రాజూ, వింతగా మాట్లాడుతున్నావు. స్కూలు పనిమీద తోటి వుపాధ్యాయులతో బజారుకు పోకూడదా? నీ మాటలు నా కర్థం కావడంలేదు."

"అక్కా నీ కర్థం గాకపోయినా లోకాని కంతకూ అర్థమై వెకిలి నవ్వు నవ్వుతోంది."

"లోకం అంటే నీకు నీ భార్యే కదా" కమల అంటించింది.

కాని రాజు "ఏమైనా నువ్వు పరాయి మగాళ్ళతో రాసుకుని తిరుగుతూ పూసుకుని మాట్లాడుతూ వుండటం నాకు గిట్టదు" కమలమీద గార్డియన్‌షిప్ చెలాయిస్తు న్నట్లుగా అన్నాడు.

" అయితే వుద్యోగంలో వున్నపుడు సాటి వుద్యోగులతో మాట్లాడకుండా వుండటం కుదురుతుందా "

" కుదరనప్పుడు ఆ వుద్యోగం మానెయ్యడమే మంచిది. "

"నే నిప్పుడు కొత్తగా వుద్యోగం చేస్తున్నా నా రాజూ"

" ఏమో నేను మాత్రం నీ మూలాన తలవంపులకు గురికాలేను. "

" అయితే నన్ను వుద్యోగం మానేయమంటావు "

" మానేసినా పరవాలేదు "

రాజిట్లా అనేసరికి కమలకి మాట రాలేదు. గొంతు పూడుకుపోయినట్లయ్యింది.

క్రిష్ణవేణి ప్రవర్తన గోరుచుట్టు. రాజు మాటలు రోకటిపోట్లు అయ్యాయి. ఆ రాత్రంతా నిద్ర లేదు కమలకి. మనసంతా తీరని సంక్షోభానికి గురయింది. నా అనుకున్న వాళ్ళ చేతనే చిత్రహింసకు లోనవుతూ వున్నది. ఇన్నాళ్ళూ కాదు ఇన్నేళ్ళూ మోడైన తన జీవితం కూలిపోవడమే గత్యంతరమా ! తన స్థితికి తాను భోరున యేడ్చే వయస్సు కాదు తనది. అలా ఏడ్పుకు లోనయ్యే బేలతనం లేదు తనకి. అయితే ఏం చెయ్యాలి ? ఏం చేస్తే బాగుంటుందో నని తల్చి తమ్ముని పెళ్ళి చేసిందో అదే తనకి బాగుండకపోయింది. తనకంతా శూన్యంగా తోస్తున్నది. తను భావించిన పరమార్థం బెడిసికొట్టింది. తను చేసిన త్యాగం లయ తప్పింది.

" ఏమిటి భగవాన్ నాకీ పరీక్ష " ఈ పరీక్ష నుండి గట్టెక్కడ మెలా ? ఎలా ? ఆలోచించేకొద్దీ ఒకే జవాబు ఎదురవుతున్నది. శాశ్వతంగా యీ లోకాన్ని విడిచిపోవడమే. కానీ ఆ జవాబు తన కెంత మాత్రమూ నచ్చనిది. ఈ సంకట పరిస్థితి నుంచి బయట పడాలి. ఎలా ? మార్గం అగమ్యం. తమ్ముడి నుంచి వేరుపడి ఇంకో అభాసుపాలు కావడం మంచిది కాదు. అయినా ఓపిక పట్టాలి. తన కోసం తాను గాక మరెవరు ఓపిక పడతారు ? యిలా అనుకొంటూ ఆలోచనల్లో తేరుకొనే సరికి తెల్లవారింది.

ఓ రోజు స్కూల్లో తొమ్మిదో తరగతి క్లాసు కెళ్ళింది తను. అది మొదటి పీరియడు. కళ్యాణి అనే అమ్మాయి పదిహేను నిమిషాలు ఆలస్యంగా వచ్చింది. ఆ అమ్మాయి కది యే ముప్పయ్యోసారో. ప్రతిసారీ హెడ్మాస్టరుగారి తోనో, క్లాసు టీచరులోనో చీవాట్లు తింటూ వుండేది. కమల ఆ అమ్మాయి ఆలస్యానికి కారణం అడిగింది. ఇంట్లో పనున్నదని ఆ అమ్మాయి జవాబు.

" మీ అమ్మా, నాన్నా నీకే పని చెపుతారా " కమల దండింపుగా అడిగింది.

" మా అమ్మ లేదండీ " అన్న కళ్యాణి మాటకి కమల ప్రశ్నార్థకంగా మొహం పెట్టింది.

" మా అమ్మ చనిపోయిందండీ. మా తమ్ముడు అప్పుడు యేడాది వాడండీ. నాకు అప్పుడు నాలుగేండ్లండీ. అప్పట్నుంచీ మా నాన్నే మమ్మల్ని పెంచుతున్నారండీ " కళ్యాణి చెప్పుకుంటూ వచ్చింది.

" మీ నాన్న కేం వుద్యోగం " కమల ప్రశ్నించింది.

" ప్యారీ యెరువుల కంపెనీలో అకౌంటెంటుగా వున్నారు " కళ్యాణి జవాబు.

కళ్యాణి కళ్ళలో జాలితనం చూసి కమల ద్రవించి పోయింది. ఆ అమ్మాయి జీవితం తన జీవితానికి ప్రతి బింబంగా కనిపించింది. కళ్యాణి యింటిపనంతా చూసుకొని, తమ్ముణ్ణి వెంటబెట్టుకొని స్కూలుకి రావలసివుంది. ఒకప్పటి తనలాగే.

మధ్యాహ్నం తీరిక సమయంలో కళ్యాణిని పిలిపించింది. " ఓ మారు నన్ను మీ యింటికి తీసికెళ్తావా " అంది. " అలాగే మేడం " బదులిచ్చింది కళ్యాణి

సాయంత్రం స్కూలు వదిలాక వరండాలో కళ్యాణి తన తమ్ముణ్ణి వెంటబెట్టుకుని వరండాలో కనబడింది. జాగ్రత్తగా యింటికి వెళ్ళండి అన్నది కమల వాళ్ళతో. కళ్యాణి తలవూపి సాగిపోయింది.

ముభావంగా వున్న మరదలూ, సంకుచిత తత్వాన్ని పులుముకొన్న తమ్ముడూ - యీ యిద్దరి మధ్య కమలకి

ముళ్ళకంప మీదున్నట్టున్నది. శరీరం యాంత్రికంగా శూన్యంలో కొట్టుమిట్టాడే జీవిలా పరిభ్రమిస్తోంది.

తర్వాత ఓ రోజు స్కూలు వదిలాక కళ్యాణి వెంబడి వాళ్ళింటి కెళ్ళింది. కళ్యాణి నాన్న అప్పటికింకా రాలేదు. ఆ అమ్మాయి మేడమ్ కమలని మర్యాదగా కూచోబెట్టి కాఫీ కాచి యిచ్చి, యాంత్రికంగా యింటిపనిలో లీనమైంది. కమల కాఫీ త్రాగి యిల్లు పరిశీలిస్తుండగా కళ్యాణి నాన్న రాజారావు వచ్చాడు. పిల్లవాడు ఆయన కెదురు పోయి "నాన్నా అక్కయ్యా వాళ్ళ మేడమ్‌గారొచ్చారు." అన్నాడు కమల్ని చూపిస్తూ. ఆవిడ నమస్కారం చేసింది. అతడు ప్రతిగా నమస్కరించి కూర్చోమని లోపలికెళ్ళి పది నిమిషాల్లో రెండు చేతుల్లోనూ కాఫీ కప్పుల్తో వచ్చాడు. కమల మొహమాటపడినా, సభ్యత పాటిస్తూ రెండోసారి కాఫీ కప్పు అందుకొంది.

"యేదైనా పనిమీదొచ్చారా మేడమ్" అడిగాడు రాజారావు.

"అబ్బే లేదండీ. కళ్యాణి గురించి పూర్తిగా యీ మధ్యే తెలిసింది. పిల్లలు తల్లిలేని వాళ్ళని తెలిసి చాలా బాధపడ్డాను. నేనూ అట్లాంటి పరిస్థితుల్లో పెరిగిందాన్నే గనుక ఓ మాటు చూచిపోదామని వచ్చాను." అని కమల చెప్పింది.

" మీ సహృదయతకి చాలా థేంక్సండీ " రాజారావన్నాడు.

" ఏమైనా మీకు కలిగిన నష్టానికి, మీ పిల్లలకు కలిగిన కష్టానికి నేను సానుభూతి తెలుపుతున్నానండీ. " అన్చెప్పి కాసేపు పిల్లల చదువుల విషయాలు అవీ మాట్లాడి కమల వచ్చేసింది.

వారం రోజుల తర్వాత కళ్యాణి రాజారావుకి తమ మేడమ్‌గారిచ్చారంటూ ఓ కవరిచ్చింది. అందులోని విషయాన్ని చదువుకొన్న రాజారావు " ఏమిటీ యీ మేడమ్ ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి, పార్కులో కలుసుకోండి అని వ్రాసింది. తన పిల్లల వల్ల స్కూల్లో యేమైనా జరిగిందా " అనుకొన్నాడు.

మరు రోజు రాజారావు కమలని పార్కులో కలుసుకొన్నాడు.

" మీరు మళ్ళీ పెళ్లి చేసుకోకూడదా మాస్టారూ " అన్నది కమల.

" మేడమ్ నా పిల్లలు సవతితల్లి ప్రేమ అనుభవించరాదని నా నిర్ణయం " ఆ జవాబుతో రాజారావు ముఖంలో విషాదం కూడా ప్రస్ఫుటమయింది.

" ఆ సవతి తల్లే చక్కటి తల్లి యెందుకు కాకూడదు. ఆ అవకాశం మీరు ఎందుకు వుండకూడదు ? "

" మీరేదో నాకు పెళ్లి సంబంధం చూస్తున్నట్లుందే " ఆ మాటకి కమల కొన్ని క్షణాలు వూరకుండి యిలా అంది.

" ఎవరో కాదులెండి, ఆ వ్యక్తిని నేనే. నాకూ చిన్నప్పుడే తల్లి పోయిందన్నాను కదా. తర్వాత తండ్రీ పోయాడు. మీ పిల్లల్లాగ నేనూ, నా తమ్ముడూ మిగిలాం. నేనీ పంతులమ్మ వుద్యోగం చేస్తూ వాణ్ణి పెద్దచేసి ఓ యింటి వాణ్ణి కూడా చేశాను. కాని నే నిప్పుడు వానికి కంటగింపుగా తయారయ్యాను. మరదలు వచ్చిన దగ్గర్నుంచీ కుటుంబంలో కలతలు అనుభవిస్తూవున్నాను. నాకు నేనుగా మిగిలి పోయాను. ఇన్నాళ్ళనుంచి కేవలం శూన్యంలో బ్రతుకుతున్నాను. "

రాజారావు వంతు వినడం మాత్రమే అయింది.

" చూడండి మాస్టారూ నేను మీకు గృహిణిగా వుండ తగనా ? మీ పిల్లలకి తల్లిగా వుండడానికి తగనా ? జీవితంలో మీరూ, నేనూ యెదురు దెబ్బలు తిన్నవాళ్ళమే. నాకు పొట్ట గడవడానికి జీతమొచ్చే వుద్యోగముంది. జీవితం గడపడానికి ఆలంబన కావాలి. మీరు సహృదయంతో అర్థం చేసుకోగలరు. మీ సహృదయతను సార్థకం చేయండి " కమల ఆవేదనతో మాటాడింది.

రాజారావు నాలుగు రోజులు ఆలోచనలతో చిడిముడి పడిన తర్వాత చివరికి కమల చెప్పిన మాటల్లోని ప్రతి అక్షరం పట్ల సానుభూతి కలిగిందతనికి.

అయిదో రోజు యిద్దరూ సెలవు పెట్టి రిజిస్ట్రార్ ఆఫీసులో దంపతులయ్యారు. కమల నేరుగా రాజారావింటికే వచ్చేసింది. ఆమె జీవితంలో ఎరుగు చూడని వసంతం చోటు చేసుకొంది.

* * *

# మ గ మా రా జు

చల్లని వెన్నెల్లో కిష్టయ్యా, కోటయ్యా వేపచెట్టు కింద బండ మీద కూచుని మాట్లాడుకొంటున్నారు.

" ఒరే కోటిగా ఎయ్యి రూపాయిలన్నా లేంది పిల్ల పెళ్ళెట్టా సేత్తావురా ఎర్రినాయాలా ? "

" ఔను కిష్టి మామా. నువ్ సెప్పింది కాదన్ను. కరుసెట్టుకోందే పిల్లనో యింటిదాన్ని సెయ్యలేంగందా. మా గంగమ్మ పుట్టినకాడనుంచీ పైసా, పైసా కూడబెట్టితే ఏడొందలయ్యింది. ఆపైది అప్పుజేసైనా లగ్గం కానిచ్చేద్దాం. నువ్ ఊఁఅను మావా. మీ నారాయుడికిచ్చి చేసేత్తాను. "

" అట్టాగే కానిచ్చేద్దాం లేరా. మాఁగ మాసాని కంతా లడీచెయ్. ఆడికి అప్పటికి పేక్టరీలో మేస్త్రీ పని కాయమవుతది. "

కిష్టయ్య ఆ మాటనేటప్పటికి కోటయ్య కెంతో సంతోషమయ్యింది.

ఆడపిల్ల గంగ తండ్రి కోటయ్యా, మగపిల్లాడి తండ్రి కిష్టయ్యా ఇద్దరూ కూలిచేసుకొని బతికేవాళ్ళే. అయితే కిష్టయ్య తలెత్తుకొని తిరుగుతాడు ధీమాగా ఎదిగొచ్చిన కొడుకుని చూసుకొని. కాని ఎదిగున్న కూతుర్ని తల్చుకొని కోటయ్య తలొంచుకొని నడుస్తుంటాడు. ఇతడికి పిల్ల పెళ్ళి చెయ్యాలని ఆరాటం. అతడికి కొడుకు పెళ్ళితో నాలుగు డబ్బులు చెయిచేసుకోవాలని ఉబలాటం.

ఏమయితేనేం కోటయ్య ప్రయత్నమూ, కిష్టయ్య కోరికా గంగమ్మని, నారాయుణ్ణి ఓయింటి వాళ్ళని చేయడంతో ఫలించాయి.

కాలం గడుస్తుండగానే నారాయుడు ముగ్గురుపిల్లల తండ్రయ్యాడు. ముగ్గురూ మగపిల్లలే. కోటయ్యా అతని భార్యా కాలం తీరి అదివరకే పొయారు. కిష్టయ్య మనవల్ని చూసుకొని మురిసిపోతుంటాడు.

"ఒరే నారిగా నీ కొడుకుల్ని సదివిచ్చరా బోల్డు డబ్బులు కట్నంగా వస్తాయి" కిష్టయ్య తన కొడుక్కి ఉపదేశమిచ్చాడు.

'ఆళ్ళ సదివినా, సదవక పోయినా మగ నా కొడుకులు. మన కేం ఫర్వాలేదయ్యా' అంటు మీసం మెలేశాడు.

పొయ్యి వూదుకుంటూ యీ మాటలు విన్న గంగమ్మ "ఓయబ్బో. మాలావు సంబడం. ఉలికులికిపడ్తుండావ్.

అంతా మా అయ్యలాంటోళ్ళే వుంటారా. డబ్బు లిచ్చి చాకిరికీ, కాపురానికి మనసున్నోళ్ళు లేడానికి. ”

“ నీ కేం తెల్సే ఎర్రిమొగమా ” అని నారాయుడు డబ్బీలోంచి ఓ పావలా తీసుకొని “చుట్టలు తీసుకొస్తానయ్యా” అంటూ బయట కెళ్ళాడు.

“ ఒరేయ్, నువ్ సంపాదించిందంతా వూళ్ళో తగలేసి పెళ్ళాం తెచ్చుకున్న కూలి డబ్బులెగరేసుకుపోతావేంరా ” కిష్టయ్య గట్టిగా కేకేశాడు.

నారాయుడు వెనక్కి తిరిగి నాయన్ని, పెళ్ళాన్ని చూసి వెకిలి నవ్వు నవ్వేసి చక్కాపోయాడు.

“ ఆయనకేం. మగాడు మావా. ఎటా తిరిగినా సరి పోతది. కట్టుకున్న నేరానికి నాకు తప్పదు గదా. ”

“ అదికాదే తల్లీ, నువ్వు అలుసియ్యబట్టే, ఆడిట్టా బరితెగించాడు. ఆడి సంపాదనంతా బీడీ కొట్టులకి, సారా బడ్డీలకి, కోడి పందేలకి చెల్లు. ఇల్లు గడనటానికి నీ రెక్కల కష్టం తప్పలేదు గందా. నేనేమో కాటికి కాళ్ళు సాచుకున్న ముసిలోణ్ణి ”

“ మరయితే కనుకున్న నేరానికి పిల్లోళ్ళకి గంజైనా కాచి పొయ్యాలగందా. ఏమనుకోని, ఏం లాభం ”

మాట్లాడుతూ, మాట్లాడుతూనే, అన్నం వండేసింది. పచ్చడి నూరి, పచ్చిపులుసు చేసి చిన్న టిఫిన్ గిన్నెలో

అన్నం, పచ్చడి తీసికొని చంటాణ్ణి వెంటతీసుకొని పనిలో కెళ్ళింది. పెద్దపిల్లలిద్దరూ మామతో బాటు ఇంట్లో వున్నారు. నారాయుడటునుంచి అట్టే ఫేక్టరీ కెళ్ళాడు. గంగమ్మ సాయంత్రం అయిదున్నరకి మళ్ళీ యిల్లు చేరుతుంది.

మధ్యాహ్నానికి నారాయుడిల్లు చేరుకున్నాడు. పెళ్ళాం చేసిపెట్టిన అన్నం పచ్చడి కంచంలో వేసుకొన్నాడు ముద్ద నోటికి సయించలేదు.

“ ఛీ ఎదవ బతుకు. కాసింత నంజుకోటానికూ కూడా ఏం లేదు. ఛా. ఛా. ” అని చీదరించుకొంటూనే తినేశాడు, మూతి తుడుచుకొని వెళ్ళిపోయాడు.

గంగమ్మ తిరిగొచ్చింది. మిగిలిన పచ్చడి, పులుసు ఆ పూటక్కూడా సరిపోతుందని, అన్నం వండేసింది. ముసిలాడూ పిల్లలూ తిని నిద్దరపోయారు. గంగ మొగుడికోసం కూచుని వుంది.

తొమ్మిది దాటాక నారాయుడు కూనిరాగాల్తో ఇంటి కొచ్చాడు. వాడి నోట్లోంచి సారా వాసన గుప్పుమంది. గంగమ్మకది అలవాటే. వాడి నోట్లో చుట్ట కంపు వచ్చినా, సారా కంపు గుప్పుమన్నా గంగమ్మ భరిస్తూనే వుంది. మరి చెట్టంత మొగుడు, ఆడు తనని భరిస్తున్నాడాయె. మొగుడి నుంచి అన్ని రకాల కంపులకూ ఆ పెళ్ళాం అలవాటుపడి పోయింది.

గంగమ్మ మొగుణ్ణి చూస్తూనే -

" ఆరింటికే ఫేక్టరీ వొదిలేత్తే ఇంత రేత్తిరిదాకా కొంపా, గోడూ గ్యాపకంరాలా నీకు " అనడిగింది.

" ఏందే, గంగా, నాకు కొంప యాడ గ్యాపకమే. నువ్వు గ్యాపకమొచ్చావ్, అంతే " అంటూ రెండు చేతుల్తో వాటేసుకున్నాడు.

" సాల్లే సరసం. కూడేమన్నా తినేదుందా, అని "

" ఛా. ఛా. ఏం కూడే. ఒట్టి పచ్చిపులుసు కూడు. ఇదో, ఏంపుడు, కోడేంపుడు మిలట్రీ వోటేల్లో తెచ్చా. పద నువ్వూ తిందువుగాని" అని గంగమ్మ నడుం మీద చేయ్యేసి నడిపించబోయాడు.

కాని తూలి పడబోయే నారాయున్ని గంగమ్మే రెండు చేతుల్తో గట్టిగా పట్టుకొని పెరట్లోకి తీసికెళ్ళి కాళ్ళు కడిగి, లోపల కూర్చోబెట్టి అన్నం వడ్డించింది.

నారాయుడు ఆ అన్నానికి తాను తెచ్చుకొన్న పొట్లం లోది తీసి జత చేసి తిన్నాడు. ఇంకా కంచంలో కొంచెం అన్నం మిగిలిపోయింది. అందులోనే కుండలో మిగిలిన అన్నాన్ని పెట్టుకొని గంగమ్మ కూడా తినేసింది.

ఆదివారాలు గంగమ్మకు కూలిపని మధ్యాహ్నంవరకే. నారాయుడికి పూర్తి సెలవు. ఆ సెలవుని నారాయుడు తన అభిరుచులకి తగ్గట్టు వినియోగించుకొంటాడు. ఊరి బయట

చింత తోపుల్లో నారాయుళ్ళెంతోమంది గుమికూడుతారు. అయిదారు వరసులు కోడి పందేలు జరుగుతాయి. సారాయి, రొట్టెలు, వండిన మాంసం అమ్ముకునే వాళ్ళకి మంచి గిరాకీగా వుంటుంది. నారాయుడు ప్రతి ఆదివారం అక్కడ హాజరుంటాడు. జోరుగా పైపందాలు కడతాడు.

ఓ ఆదివారంనాడు నాలుగు వరసల్లో వరుసగా అరవై రూపాయలు పోగొట్టుకున్నాడు. అయిదో పందెం గెలిచాడు. చేతిలో ముప్పై రూపాయలున్నాయి. పందేలయిపోయాయి. చివరి పందెం గెలిచినందున ముందు పోయిన పందేలన్నీ మరిచి విజయతాండవం చేశాడు. మాంఛి నిషాలో వున్నాడు. ఓడిపోయిన కోడి నొకదాన్ని పదిరూపాయలకి కొన్నాడు. రాత్రి వండించుకుని తినటానికి.

ఇంటి కొచ్చి "ఏమే గంగా. యిట్రారా. ఇదో యీ కోడిని చూడు. పెందెం గెల్చి కొనుక్కొచ్చా. తీసుకొనిపోయి కూరచెయ్" అన్నాడు.

గంగమ్మ చూచి "పందెం గెలిచావా" అనడిగింది.

"ఏమనుకున్నావే నేనంటే" విజయగర్వంతో బదులు చెప్పాడు.

"ఓయబ్బో. ఇదివరకంతా తగలేసిన పందేలెన్ని ? అమాశెకు, పున్నానికి గెలిస్తే మధ్యన పోయిన సొమ్మెంతో

లెక్కెట్టుకో గుండె గుబేలంటది. అయినా యీ పందేలూ పాడు ఏంటి మావా. ఆ డబ్బులుంటే ఇంట్లోకి ఆధరువు గాదూ" అంటూ మెత్తగానే దులిపేసింది.

నారాయుడికి గంగమ్మ హితవు రుచించలేదు. వినే వోపిక లేక కోడి నామె చేతిలో పెట్టి మంచంమీద పడిపోయాడు మత్తుగా. అంత రాత్రిలోనూ గంగమ్మ వోపిగ్గా కూర వండి మొగుణ్ణి లేపి వడ్డించి తినిపించింది.

రోజులు గడుస్తుండగా కిష్టయ్య గుటుకు మన్నాడు. గంగమ్మకి తన అయ్య చచ్చినప్పటి దుఃఖం మళ్ళీ ముంచుకొచ్చింది. నారాయుడెంతగానో సముదాయించాడు. ముసలాడు పోయినందువల్ల కష్టం వానికేమీ కనిపించలేదు. కాని పిల్లల్ని చూచుకొనే దిక్కు లేకపోయెనే అని గంగమ్మ బాధ. కొన్నాళ్ళపాటు ముగ్గుర్నీ తను పని చేసే చోటికి తీసికెళ్తూ వచ్చింది. అక్కడ యితర పనివాళ్ళ పిల్లల్తో ఆడుకొంటూ వుండేవాళ్ళు.

అక్కడ షావుకార్లు పనిలోకి వచ్చిన ఆడంగులందర్నీ పేరుపేరునా పిల్చి వాళ్ళ మొగుళ్ళని అదే పనిగా తిట్టి పోస్తుంటాడు. కొందరు తిరుగుబోతులు, కొందరు నారాయుడిలా సంపాదించే డబ్బుల్ని యింటికి చేర్చకుండా జల్సాలు చేసుకొనే జులాయిలు. ఈ ఆడవాళ్ళంతా కష్టాల్ని భరిస్తూ, కాయకష్టంతో సంసారాల్ని ఈదటానికే జన్మ యెత్తిన శాపగ్రస్తులని ఆ షావుకార్లు అనుకొంటూ వుంటాడు.

ఓ రోజు ఉదయాన గంగమ్మ ఇంట్లో పనంతా ముగించుకొని పనిలోకి పోవాలని బయలుదేరినా నారాయుడింట్లోనే వుండిపోవటం చూసింది.

" ఏంటయ్యో ఒంట్లోగాని నలతగా వుందా ఫేక్టరీకెళ్ళ లేదు. " అనడిగింది.

" ఇంక నా పని కాళీయేనే. నిన్నటితో నా పని సరి. అదేందో మిషను తెచ్చారంట మావోనరు. ఇరవై మందికి పని పోయింది. ఆళ్ళకి మేస్త్రీగా నాకూ మూడింది. ఆళ్ళంతా తలో పనికి పోతారు. నా కేంటి చేతవుతది ? పజ్జేసేవోళ్ళ నదిలించటంతప్ప. అందుకే ఇంట్లోనే కూకున్నా. "

నారాయణ చెబుతోంటే గంగమ్మకేమీ బాధనిపించలేదు, వాడి సంపాదన యింటిదాకా రాదు గనుక.

" పోతేపోయిందిలే బోడి పని. కూటికొచ్చిందా, కూరకొచ్చిందా. పిల్లోళ్ళని చూసుకుంటూ వుండు. నే పన్లోకెళ్ళొత్తా " అని పిల్లలందర్ని ఇంట్లో పెట్టి పోయింది.

పనిలేని నారాయుడికి పెళ్లామే రోజూఅర్థరూపాయో, ముప్పావలాయో చేతికిస్తుంటుంది, వాడి ఖర్చులకి.

చింత చచ్చినా పులుపు చావనట్టు నారాయుడు చుట్ట కాల్చడం మానలేదు. త్రాగడం మానలేదు. ప్రతి ఆదివారం కోడి పందేలకి వెళ్ళకుండా వుండటమూ లేదు.

వాళ్ళ వీధిలో అంతా కాయకష్టం చేసుకొని బతికే వాళ్ళే. ముసలీ ముతకా ఇంట్లో పడివుంటారు శక్తి వుడిగి నందున. మగాళ్లు పనిచేసుకున్నా, లేకున్నా పైలాపచ్చీసుగా ళ్లే. ఆడాళ్ళు సంసారాలనీదడానికి శ్రమిస్తూనే వుంటారు. ఆ వీధిలో అందరికీ గంగమ్మ అంటే అభిమానమూ, జాలీ. ఆ యిల్లాలు మొగుడు పని చేసినా, చేయకపోయినా, తాగి వచ్చినా ఏమీ అనదు. అక్కడ చాలామంది ఆడవాళ్లు వాళ్ళ మొగుళ్ళ తాగివస్తే తిట్లకు లంకించుకొని, నానా రాద్ధాంతము చేస్తుంటారు. ఆ తాగుబోతుల చేతి బూతులూ, తిట్లూ తింటూ వుంటారు. వాళ్ళ జీవితాలు అట్లా అలవాటుపడ్డాయి.

నారాయుడికి ఆ మధ్య నొకదఫా టైఫాయిడు వచ్చింది. పాపం గంగమ్మ ఓపిగ్గా వానికి సేవ చేస్తూ, ఆసుపత్రి నుంచి మందు తెచ్చియిస్తూ, దాచివుంచిన డబ్బుల్తో మందులుకొని, బత్తాయిపళ్లూ, పాలూ, రొట్టె తెచ్చి యిస్తూ కళ్ళలో వొత్తులు పెట్టుకొని కాపాడుకొంది. వీధిలో వాళ్ళంతా "గంగా నీకెంత ఓపికే తల్లీ" అంటూ పొగిడేవాళ్ళు. గంగమ్మ పొంగిపోయేది.

ఆ మధ్య నారాయుడు పెద్ద పిల్లలిద్దర్ని బళ్ళోకి పంపాడు. పెద్దాడు రాముడు తొమ్మిదేళ్ళ వాడయ్యాడు. మూడోవాడింకాతల్లినంటిపెట్టుకొనే వుంటాడు. నారాయుడు కోలుకున్నాక ఇంటి ముందర వేపచెట్టు కింద తన లాంటి వాళ్ళతో పులిజూదం ఆడుతుంటాడు.

ఓ రోజున గంగమ్మకి సుస్తీ చేసింది. నడుం పట్టేసింది. ఒళ్ళంతా నిస్సత్తువయింది. మూలుగుతూ పడుకొంది. పక్కింటి రంగమ్మ తను పిలిపించి ఇంటి పనంతా చేయించింది. ఆసుపత్రి కెళ్ళి మందు పట్రమ్మని నారాయుణ్ణి అర్థించింది. వాడీ పనిని తమ పెద్దకొడుక్కి వప్పజెప్పాడు.

నారాయుడి వాలకం చూసి రంగమ్మ చనువు కొద్దీ "ఒరే నారాయుడూ నువ్వు మంచానపడ్తే అది నీకెన్ని సేవలు చేసిందిరా. దాని మొకాన కాసిని మందునీళ్ళయినా తెచ్చి కొట్టవేరా ముదనష్టపోడా" అంటూ తిట్లకు లంకించుకొంది.

వాడి కివేం పట్టలేదు.

"పెద్దాణ్ణి పంపాలే చిన్నమ్మా, వాడు తెస్తే మందు కాదూ. నాల్రోజుల్లో గంగి లేచి తిరుగుతుందిలే" అని చక్కా వీధిలోకి చెక్కేశాడు.

వీధిలో పోతున్న వీణ్ణి చూసిన ఆడంగులంతా -

"పోతున్నాడు. మగమారాజు పోతరాజులా. తిండికి తిమ్మన్న పనికి పోతన్న. ఆడదాన్నేడిపించుకుతినే యెధవ" అంటూ వుంటారు.

వాళ్ళ మొగుళ్ళలో కూడ అట్లాంటివాళ్ళున్నారు. అందర్నీ కలిపి కూడా ఆ మాటలంటూ వుంటారు.

మొగుడి సేవలేమీ లేకున్నా గంగమ్మ నెమ్మదిగా కోలుకొంది. ఇరుగు పొరుగువాళ్ళ దగ్గర నలభైరూపాయలకు

పైగా అప్పు చేసింది. కొంత శక్తి వొచ్చాక పన్లోకి వెళ్ళడం మొదలెట్టింది. తొమ్మిదేళ్ళు పైబడుతున్న రాముణ్ణి కూడా తనతో బాటు పనిలోకి తీసికెళ్ళడం అవసరమయింది.

నారాయుడు తాగటం, కోడిపందేల కెళ్ళటం జరుగుతూనే వుంది. పెళ్ళామిచ్చిన చిల్లర డబ్బులతో చుట్టలు కాలుస్తూ మొదటి రవుండు త్రాగుడు జరుపుకుంటున్నాడు. ఆ పైన స్నేహితులు వుండనే వున్నారు.

రాముడికి పదో ఏడు పడింది. అమ్మ కష్టపడి సంపాదించటమూ, అయ్య బలాదూర్ తిరగడమూ వాడికి గిట్టటం లేదు.

"ఏందే అమ్మా! అయ్య అట్టా తిని తిరక్కపోతే మనతో ఓ పన్లోకి రాగూడదూ" అంటూ గునుస్తుంటాడు.

"ఓరెర్రి సన్నాసీ. మీ అయ్య అప్పుడంతా పన్జేసేవోడురా ఫేక్టరీలో మేస్తిరి పని. మిషినీలొచ్చి మీ అయ్యకి పన్లేకండా పోయింది. మనం జేసే పని ఎట్టా సేత్తాడు" గంగమ్మ అనునయిస్తుండేది.

వాడిప్పుడిప్పుడే లోకాన్ని పారజూస్తున్నాడు. అమ్మ మాట లేమాత్రము నచ్చక పెదవి విరుస్తుంటాడు.

పనీ పాటా లేకున్నా నారాయుడికి వాడి అభిరుచుల వల్ల ఒంట్లో శక్తి సన్నగిల్లింది. రక్తం చెడింది. డాక్టర్లు చెప్పేదాన్ని బట్టి లివరు మూత్రపిండాలు చెడినాయి. కొన్నాళ్ళకి నెత్తురు కక్కుకుని చచ్చాడు.

గంగమ్మ లబోదిబోమంది. ఎంతయినా మూడుముళ్లు వేసిన మొగుడు. తన ముగ్గురు బిడ్డలకి తండ్రి గుటుక్కు మన్నాడు.

" ఓర్నాయినో నా దేవుడు పోయాడోర్రి, నా పసుపు కుంకం మట్టిపాలైందిరో " అంటూ నెత్తీ నోరూ బాదు కుంటూ రోదించింది.

రాముడు గుడ్లప్పగించి చూస్తున్నాడు. వాడికే దుఃఖం ముంచుకొని రావటం లేదు.

ఆ వీధి వీధంతా చేరారు.

తలోమాటా అంటూ గంగమ్మకు, పిల్లవాండ్లకు సానుభూతి చూపుతున్నారు.

" పాపం గంగమ్మకి మగదిక్కు లేకుండా పోయింది "

" ఇంకెట్టా బతుకుతుందో. ఒక్తె ఎర్రిబాగుల్ది "

గంగమ్మ వింటూనే చీదుతూ, ఏడుస్తూ, మూలుగుతూ వుంది.

" ఎంతయినా మొగుడు లేని బతుకు బతుకే కాదు "

అయ్యో పాపం నేదర బిడ్డలు, గంగమ్మ యింకెట్టా బతుకుద్దో "

ఆ మాటలతో రాముడికి ఆశ్చర్యం ముంచుకొచ్చింది. అయ్య బతికుండగా ఒక్కపైసా తమకోసం ఖర్చుపెట్టలేదు సరికదా తల్లి కష్టంతో పొట్ట పోసుకుని మరీ చచ్చాడు.

ఇద్దరు ముసలమ్మలు " ఈ రోజుతో గంగమ్మ పీడ విరగడైంది. యదవ సచ్చినోడు పెళ్ళాడింది మొదలు దాని వుసురు తోనే బతికాడు " అని అక్కసు వెళ్ళగక్కారు. కాని ఆ మాటలు వాళ్ళిద్దరి చెవుల్లోకి తప్పమరెవరి చెవుల్లో దూరలేదు.

" ఆ బిడ్డల్నింకెట్టా సాకుతుందో పాపం గంగమ్మ " ఇదివరకంతా నారాయుడే కష్టం చేసి పోషించినట్టు ఓ ముత్త యిదువ సానుభూతి.

" ఆడదానికీ ముండ బతుకు రాగూడదే తల్లీ " మరో ముత్తయిదువ నిట్టూరుస్తూ ప్రవచించింది.

"గంగమ్మ ముందుజన్మలో ఏం పాపం చేసిందో," తన కళ్ళముందే మొగుడు చచ్చాడు ఓ తల్లి వికారంగా అంది.

రామునికీ మాటలు అసహ్యమయ్యాయి. వాడిదింకా అపరిపక్వ మనస్సు.

" నారాయుడి కేమన్నా మగమారాజు. సల్లంగ దాటు కున్నాడు " ఓ పండుముత్తైదువ ప్రక్కవాళ్ళతో చెబుతుంటే రాముడికి మరింత వెగటనిపించింది.

అయినా నారాయుడు మగ మారాజు. గంగమ్మ కేవలం అబలేకాని కష్టించి సంసారాన్ని దే ఆడది. నారాయు డేమో " మగమారాజు "

-*-*-

# సమిధలు

" అయ్యగోరు, అయ్యగోరు మన సుబ్బణ్ణి ఎంకయ్యగారి మనుషులు చితకబాది వూరిముందర చింతమాని కింద పడేసి పోయినారయ్యా-

ఆడికి వచ్చేపేణం, పొయ్యేపేణంగా వుంది. ఎంటనే బండి కట్టించి టవునాసుపత్రికి తీస్కెళ్లాలయ్యా " అని నర్సిములు రాఘవయ్యతో చెప్పాడు.

రాఘవయ్య వాడి చేతికి అరవైరూపాయలిచ్చి సుబ్బణ్ణి బండ్లో వేసుకొని ఆస్పత్రికి తీస్కెళ్ళమన్నాడు.

రాఘవయ్య వీరపల్లెలో పదికాండ్ల మోతుబరి రైతు. ఆరేళ్ళ క్రిందట మడి తడుపు నిళ్ళ పారకంలో పక్క పొలం యజమాని వెంకయ్యతో తగాదా వచ్చింది. అది లగాయతు వాళ్ళిద్దరి మధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటూంది. ఆ వైరం వాళ్ళ పాలేర్లూ పనిమనుషులకు కూడా ప్రాకింది.

ఆ ప్రాంతంలో అది సహజమే. దాని ఫలితమే సుబ్బడు చావు దెబ్బలు తినడం. దీనికి బదులు తీర్చుకోకపోతానా అని రాఘవయ్య తనవాళ్ళముందు శపథం చేశాడు.

ఒకసారి వెంకయ్య పాలేరు రాజన్న ఒంటరిగా వస్తూంటే రాఘవయ్య మనుషులు కాపు వేసి మరీ అతని కాళ్ళూ, కీళ్ళూ విరిచేశారు. వెంకయ్య అతనికి తన సొంత ఖర్చులతో వైద్యం చేయించాడు. ఈ భూస్వాముల వైషమ్యాలతో గ్రామమంతా రెండు కక్షలుగా చీలిపోయింది. వాళ్ళ రంపుల్తో రాజింతాల్తో ఆ వూళ్ళో రిజర్వు పోలీసు బందోబస్తు సంవత్సరంలో మూడు, నాలుగు నెలలుండాల్సిందే. ఖర్చులు యిరుపక్షాలవాళ్ళూ భరించేవాళ్ళు.

రాఘవయ్యకు చంద్ర ఒక్కగానొక్క కొడుకు. పట్నం కాలేజిలో బి. కామ్ చదువుతున్నాడు. వెంకయ్యకి యిద్దరే సంతానం. లీలావతి పెద్దమ్మాయి. స్కూల్ ఫైనల్ తో చదువాపించాడు వెంకయ్య. చిన్నవాడు రాము ఇంకా ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్నాడు.

ఓ రోజు సాయంకాలం పొద్దుగూకిన తర్వాత వెంకయ్య పనిమనిషి యర్రియ్య ఎడ్లను పొలంనుంచి తోలుకొని కామందుగారింటికి వస్తున్నాడు. వూరి ముందర మామిడి వనం పక్కగా యిద్దరు మనుషుల నీడల్ని గమనించాడు. పరిశీలనగా చూచి వాళ్ళు తమ కామందు కూతురు లీలావతి,

అవతలి పార్టీ లీడరు రాఘవయ్య కొడుకు చంద్రింగా గుర్తించాడు. యర్రయ్య యింటికొచ్చి గొడ్లచావిట్లో ఎడ్లను కట్టేసి గాట్లో రెండు గడ్డికట్టలు పడేసి మొగసాలలోనికి వచ్చాడు. అక్కడ వెంకయ్య తన గూపువాళ్లు అయిదారు మందితో రాబోయే పంచాయితీ ఎన్నికల గురించి, రాఘవయ్య మనుషుల్ని చిత్తు చేయాల్సిన యెత్తులను గురించి మంతనాలు సాగిస్తున్నాడు, కాసేపటికి వాళ్ళంతా వెళ్ళిపోయారు. ఎవరూ లేకుండా చూచి యర్రయ్య వెంకయ్య ప్రక్కగా వచ్చి "అయ్యగోరు ఇంక మనం చానా జాగర్తగా వుండాల. లేకపోతే వూళ్లో తలెత్తుకోలేం. మన లీలమ్మ, ఆ రాఘవయ్య కొడుకు చంద్రంతో ఒంటిగా కలుసుకొంటూ, మాట్లాడు కుంటూ వుండారు. ఇదంతా మనకెంతో బగిసీనం" అన్నాడు.

వెంకయ్య ఆ మాటలు విని "ఏమోయ్ యర్రయ్యా నువ్ చెప్పేదంతా నిజమా?" అన్నాడు.

"మీ వుప్పు పులుసు తిని బతుకుతున్నానయ్యా మీ పరువు కోసం నా పాణాన్ని పణంగా పెట్టినా గదయ్యా, అమ్మాయిని మీరే కనుక్కోండి. మీరు వూఁ అంటే చాలు ఆ చంద్రం నాయాల్ని నటికి పోగులు పెడ్తా" యర్రయ్య ఆవేశంగా అన్నాడు.

"సరే నువ్వెళ్ళు. ఆ సంగతి నేను చూసుకుంటా" అని వెంకయ్య లోపలికెళ్ళాడు.

లీలావతి పాఠాలు చదువుకొనే తన తమ్ముని ప్రక్కనే కూర్చుని వారపత్రిక తిరగేస్తూ వుంది. వెంకయ్య లీలావతి వద్ద కొచ్చి జబ్బపుచ్చుకొని పైకిలాగి "ఏమే పాపిష్టిదానా ఆ చంద్రంగాడితో సాయంకాలమంతా కబుర్లాడుతూ కూర్చున్నావా వూరి బయట. ఇంక మీదట నువ్వ యిల్లు కదిలితే నీ తోలు వొలిచి కర్ర వేసేస్తా. జాగ్రత్త" అని చెంప ఛెళ్ళుమనిపించి ఆ అమ్మాయిని కూలేశాడు.

అది చూసి వంటింట్లో నుంచి ఆయన భార్య కామాక్షమ్మ విసురుగా వచ్చి "మీరేం మనుషులండీ అసురసంధ్యాల ఆడబిడ్డని పట్టుకొని అలాకొడ్తారు. నెమ్మదిగా అడిగి బుద్ధి చెప్పకపోయారూ" అంటూ సాగదీసింది.

"నోర్మూయ్. అది నీ అలుసు చూసుకొనే అంత బరి తెగించింది. ఈడొచ్చిన ఆడపిల్ల పరాయిమగాడితో, అదీ నా విరోధి కొడుకుతో జలసాలాడుతుందా. యిట్లాంటి సొట్ట చేష్టలు చేస్తే నిన్నూ, దాన్ని సిలువునా పాతేస్తా" అని రుస రుస లాడుతూ వెళ్ళాడు వెంకయ్య.

మరునాడు సాయంత్రం చంద్రం తమ సంకేత స్థలం వద్ద లీల కనబడకపొయ్యేసరికి ఆలోచనలో పడ్డాడు. తను స్కూల్లో చదుతూన్నప్పటినుంచీ లీలతో చనువుగా వుంటున్నాడు. ఆమె చదువు చాలించి, తాను కొనసాగిస్తున్నా తను సెలవుల్లో వూరొచ్చినప్పుడు, యిద్దరు మామిడితోట వద్ద కలుసుకొంటూ తమ తండ్రుల స్వార్థాన్ని, వైరాన్ని

తల్చుకొని నిట్టూర్చుతూ ఏదో విధంగా గ్రామ కక్షల్ని మాన్పి జనం శాంతితో బతికేటట్టు చేయాలని, సంక్షేమ కార్యక్రమాల్తో నవ చైతన్యం పొంగించాలని ఆలోచన చేస్తూ అందుకు పరిష్కారంగా తామిద్దరూ వివాహం చేసుకొని పెద్దల కళ్లు తెరిపించాలనుకొన్నారు.

లీలావతి తనను కల్సుకోవడానికి రాలేదంటే ఆమె తండ్రి దిట్టా చేసి వుంటాడని చంద్రం వూహించాడు. సెలవుల తర్వాత అతడు మళ్ళీ పట్న మెళ్ళాడు.

తర్వాత అందరూ అనుకొంటున్న పంచాయతి ఎన్నికలు దగ్గరపడ్డాయి, ఇరు పక్షాలవాళ్ళూ ప్రచారాలు ముమ్మరంగా సాగిస్తున్నారు. వెంకయ్య తన తరఫున రంగయ్యను ప్రెసిడెంటుగిరికి పోటీ పెట్టించాడు. రాఘవయ్య స్వయంగానే రంగంలోకి దిగాడు. ప్రతి వార్డులో యిరు వైపుల బలమైన అభ్యర్థులు పోటీలో వున్నారు. ప్రచారంలో రెండు మూడు వీధుల్లో సంకుల సమరం జరిగింది. పోలింగు రోజు రాకముందే రాఘవయ్యగారి నర్సిములుకు కుడి కన్ను పూర్తిగా చితికిపోయింది. వెంకయ్యగారి వీరయ్యగారి వీరడికి యెడమకాలు విరిగిపోయింది. ఇతర్లకు యెందరికో యిట్లాగే దెబ్బలూ, గాయాలు. వీళ్ళ రైటింగుల్ని అదుపులో పెట్టాలని వచ్చిన రిజర్వు పోలీసుదళం ఎలక్షన్లు అయినాక మూణ్ణెల్లవరకు పల్లె వదల్లేదు. రాఘవయ్య సర్పంచి అయినాడు. వెంకయ్యవాళ్ళకు కళ్ళల్లో కారం పోసినట్లుంది.

వైషమ్యాలు, కార్పణ్యాలు యింకా పెచ్చురేగినాయి. వెంకయ్య మనుషులు ఓడిపోయిన కాంతాళంతో రాఘవయ్య మనుషుల్ని అయిపు లేకుండా చెయ్యాలని వరాట్లు వేసుకొంటున్నారు. అసలు మనిషి రాఘవయ్యనే ఎత్తేయాలని ఎత్తులు పన్నుతున్నారు. వీళ్ళూ వీళ్ళ జాగ్రత్తలో వుంటున్నారు. అయినా వెంకయ్య ముఠా రాఘవయ్య మనుషులిద్దర్ని చావడివద్ద నడిరోడ్డుమీదనే తలలు నరికి పారిపోయారు. పోలీసులు వెంకయ్యను, మరికొందర్ని అరెస్టు చేశారు. జామీనుమీద వెంకయ్య, తన మనుషులతో కూడా బయటికొచ్చి కేసు వాదించడానికి తగువైన లాయర్ని నియోగించాడు.

కొన్నాళ్ళకు వూళ్ళో గంగమ్మ జాతర వచ్చింది. వూరిబయట చింతతోపులో మూడు రోజులు తిరునాల జరుగుతుంది. ఎడ్ల పందాలు, బండ్లు లాగడం, బండకొయ్యలు లాగడం వగైరా వేడుకలుంటాయి, అన్నీ సక్రమంగా వుంటే.

తిరునాల సమయానికి చంద్రం కూడా వూరొచ్చాడు. లీలను తను పెండ్లి చేసుకుంటానని, గ్రామంలో ముఠాలు లేకుండా శాంతియుత సహజీవనానికి యిట్లా చేయడం మంచిదని తండ్రికి చెప్పాడు తను. కాని వాళ్ళ వూసెత్తితే తన రక్తం కళ్ళజూస్తానన్నాడు తండ్రి.

తిరనాల రానేవచ్చింది. మొదటి రోజు బోనాలు తీసుకెళ్ళేటప్పుడు ఇరు వర్గాలు చెరో దారిగుండా బోనాలు

సాగించారు. ఒకరికొకరు యెదరయ్యే పరిస్థితి లేనందున ఘర్షణ ఏమీ లేకుండాపోయింది. ఊరంతా బోనాల వేడుకలో వుండగా లీలా చంద్రం తెలిపి చూచుకొని ఒంటరిగా కలుసుకొన్నారు. లీల అకారం ఆవేదనాపూరితంగా వుంది. చంద్రం మనస్సు అశాంతితో నిండి వుంది. వక్రిస్తున్న విధిని ఓడించడానికి వాళ్ళిద్దరూ మార్గాంతరం వెదుకుతున్నారు.

" మనిద్దరి వల్లనైనా మన పెద్దలు సఖ్యంగా వుండే మార్గముందా లీలా " అన్నాడు చంద్రం.

అందుకామె " నామట్టుకు సుఖాంతానికి దారి తీసే మార్గం ఏదీ లేనట్టుంది. మా నాన్న నా కిష్టంలేని వాడికి ఎవనికో నన్ను కట్టబెట్టే ఆలోచనలో వున్నాడు. వీళ్ళకు ప్రాణాలంటే గడ్డిపోచలకంటే తక్కువే " అన్నది.

" మనిద్దరం ఒకటైతే వాళ్ళకు గిట్టదు. మన చావునైనా సహిస్తారు కాని మన సుఖం అక్కర్లేదు యీ పెద్దలకు" అన్నాడు చంద్రం.

" అది మనం చూస్తున్నాం, అనుభవిస్తూ వేదనతో, యాతనతో బ్రతుకుతున్నాం గదా ". అన్నదామె.

" కాబట్టి మనం ధ్వస్తేనైనా వీళ్ళ కళ్ళు తెరుస్తారేమో కదా లీలా " అని చెప్పి చంద్రం లీలతో సెలవు తీసుకొన్నాడు. మర్నాడు మళ్ళీ కలుసుకొనే ఏర్పాటుతో విడిపోయారు.

అమ్మవారి మొక్కుబళ్ళూ; పూజలు, పునస్కారాలు అయిపోయినాయి. ఇక చివరిరోజున యెడ్ల పందాలు జరుగుతున్నాయి. ఇక్కడ కూడా రాఘవయ్యా, వెంకయ్యా ప్రధాన ప్రత్యర్థులు. ఇరువైపుల యెద్దులకు జిగినీ కాయితాలు కొమ్ములకు చుట్టి చివర చిరుగంటలతో కుప్పెలు కట్టి మెళ్ళో గంటల పట్టెడ, మూపున జగేల్‌మనే మొఖమల్ గుడ్డను కప్పి, రంగు రంగుల వుల్లన్ కుచ్చులు వేళ్ళాడదీసి యెద్దులను వూరేగింపుగా తప్పెట్లతో తాళాలతో తీసుకొచ్చారు.

పొడవాటి బండను ఎడ్లతో లాగిస్తున్నారు. ఏ ఏ ఎద్దుల జత ఎంతంత దూరం లాగిందో తెలుసుకొనే కొలతల వద్ద పేచీ వచ్చింది. ఇది సుమారుగు చాటు ఘర్షణ అయి పెద్ద పోట్లాటకు దారి తీసింది. ఇరు వర్గాలవారూ హోరాహోరీ తిట్టుకుంటున్నారు కొట్టుకొంటున్నారు. మెడపట్లు, సిగపట్లు సాగుతున్నాయి.

ఇంకా యిండ్లవద్ద పనులు తెముల్చుకొని తీరిగ్గా తిర్ణాల స్థలానికి వచ్చిన కొంతమంది పెద్దగా కేకలుపెడుతూ "వెంకయ్యా, రాఘవయ్యా మీ కొట్లాటలు పాడుగాను మీ బిడ్డలు దోవలో చచ్చి పడున్నారు. చూస్తురాండి" అంటూ అరిచారు. ఆ యిద్దరు పెద్దలూ పరుగుపరుగున వచ్చారు. లీలా చంద్రం శవాల్ని చూశారు. వారి ప్రక్క ఖాళీ ఎండ్రిన్ డబ్బాలు కూడా చూశారు.

కూతురి శవం మీద వెంకయ్యా, కొడుకు శవం మీద రాఘవయ్యా పడి యేడుస్తున్నారు. ఆ క్షణం క్రితం వరకూ వున్న వాళ్ళ కక్షలు, కార్పణ్యాలు పటాపంచ లైనాయి. ఇన్నాళ్ళ శత్రుత్వంతో యిప్పుడేం సాధించారో తెలిసొచ్చింది.

" వెంకయ్యా నా అవివేకానికి బిడ్డలిద్దరు ప్రాణాలు తీసుకున్నారయ్యా. నేను మ ని షి ని కాను " అంటూ రాఘవయ్యా-

" లేదు రాఘవయ్యా నా మూర్ఖత్వానికే ఈ బిడ్డలు బలై పోయారు. నా అంతటి పాపిష్టివాడుండడయ్యా " అని వెంకయ్యా-

రోదించసాగారు.

" వెంకయ్యా, రాఘవయ్యా లేవండి. ఇప్పటికి అయ్యింది చాలు. మన గ్రామ శాంతి యజ్ఞానికి యీ పిల్లలిద్దరు సమిధలై ఆత్మత్యాగంతో మన కళ్ళు తెరిపించారు. తరతరాలుగ ఇక మీదట మన గ్రామాల్లో కక్షలుండరాదు " అంటూ రంగయ్య తదుపరి కా ర్య క్ర మా ల కు వుపక్రమించాడు.

-**-

# ఇది వరకట్నం చావు కాదు

బోస్ నగర్‌లో పధ్నాలుగో నెంబరు యింట్లో శేఖర్ రేవతి కాపురముంటు న్నారు.

వాళ్ళావూరు వచ్చినప్పటి నుంచి వాళ్ళింట్లో రంగమ్మ పనిమనిషిగా వుంటున్నది.

ఓ రోజు రేవతి యింటి వీధి వాకిలి మూసివున్నందున రంగమ్మ పెరటివైపు వెళ్ళి మూసున్న తలుపులు తోస్తే తెరుచుకున్నాయి. ఆమె వంటింట్లోకి వెళ్తే యజమానురాలు రేవతి చచ్చి పడివుంది. రంగమ్మ వీధిలోకి పరుగెత్తి "ఓయమ్మో రేవతమ్మనెవరో చంపేశార"ంటూ కేకలేయ సాగింది. ఇంటి ముందు జనం పోగయ్యారు కానీ ఎవరూ లోపలికెళ్ళడానికి సాహసించలేదు, ఇంట్లో మరెవ్వరూ లేరు గనుక. కొందరు వెంటనే వెళ్ళి పోలీసు స్టేషన్లో రిపోర్టిచ్చారు.

యస్సై రంజిత్ నలుగురు కానిస్టేబుళ్ళతో ఆ యిల్లు చేరుకున్నారు. ఒకచోట స్టవ్ పడివుంది. ఆ పడివున్న స్టవ్ కు పది అడుగుల దూరంలో రేవతి శవం పడివుంది. ఓ ప్రక్కగా కిరోసిన్ డబ్బా పడివుంది. రంజిత్ అన్నీ గమనించి, వ్రాసుకొన్నాడు. రెండు రోజులుగా రేవతి, ఆమె భర్త శేఖర్ డబ్బు గురించి ఘర్షణ పడుతున్నారని ప్రక్కయింటి వాళ్ళన్నారు. రంగమ్మ కూడా అలాగే చెప్పి, ఆ ముందురోజు శేఖర్ రేవతిని సాచి లెంపకాయ కొట్టి విసురుగా బయటికెళ్ళి పోయాడని చెప్పింది.

రంజిత్ దాన్ని వరకట్నం చావుగా ప్రకటించి, పూరంతా గాలించి శేఖర్ని పట్టుకొని అరెస్టు చేసి లాకప్ లో పెట్టాడు. యఫ్. ఐ. ఆర్. వ్రాసి రెడీ చేశాడు. ఎవరో టెలిగ్రామ్ యిస్తే ప్రక్క వూరు నుంచి రేవతి తండ్రి నేరుగా స్టేషనుకు వచ్చి స్టేషన్లో శేఖర్తో "నాకు జాబు వ్రాస్తే నేను డబ్బు పంపకపోయానా, డబ్బుకోసం ఎంత పని చేశావయ్యా" అంటూ బావురుమన్నాడు. కాని శేఖర్ తాను రేవతిని చంపలేదని, పిక్ పాకెట్ లో డబ్బు పోతే, పేకాటలో పోగొట్టుకొచ్చానని ఆవిడ నిలవేసి, గొడవ చేసిందని, కేవలం ఒకే ఒక చెంపదెబ్బ మాత్రం కొట్టానని, ఆమెను చంపాల్సిన అవసరమే తనకు లేదని మొత్తుకున్నాడు.

అప్పుడే యిన్‌స్పెక్టర్ రామమూర్తి వచ్చి అంతా విన్నాడు. రంజిత్ వ్రాసిచ్చిన యఫ్. ఐ. ఆర్. చదివాడు. మళ్లీ నేరం జరిగిన చోటికి వెళ్దాం పదమని రంజిత్‌తో సహా, కానిస్టేబుళ్ళను తీసుకొని రేవతి వాళ్లింటికి చేరుకొన్నారు.

రామమూర్తి రేవతి శవాన్ని పరిశీలనగా చూశాడు. ఆమె జడ పైభాగంలో అల్లిక బాగా వొదులై కొన్ని వెంట్రుకలు వూడి క్రిందపడి వున్నాయి. రంజిత్ బయట జనాన్ని కంట్రోల్ చేస్తూ లోపలికి ఎవరూ జొరబడకుండా చూస్తున్నాడు. శవం ప్రక్కన సిగార్ లైటర్‌ని గుర్తించిన రామమూర్తి దాన్ని చేతి గుడ్డతో పట్టి తీసుకున్నాడు. బయట వున్న యస్. ఐ. రంజిత్‌ని కేకేసి పిల్చారు. అతను దగ్గరకి రాగానే అతని చొక్కాకున్న నేమ్ ప్లేటును పరిశీలనగా చూశాడు. వెంటనే "మిస్టర్ రంజిత్, నిన్ను అరెస్టు చేస్తున్నాను. నిజం వున్నదున్నట్టుగా చెప్పు. నేరం ఒప్పుకుంటే శిక్ష తగ్గుతుందని నీకూ తెలుసు" అంటూ చేతి గుడ్డలోని లైటర్ని, తన చేతికర్రతో రంజిత్ నేమ్‌ప్లేట్‌కు చిక్కుకున్న రెండు వెంట్రుకల్ని చూపాడు.

రంజిత్ ముఖం పాలిపోయింది. అసలు విషయం చెప్పేశాడు. తను, రేవతిని చదువుకునే రోజుల్లో ప్రేమించానని, ఆమె తనను అంగీకరించక అవమానించిందని, ఆమె యీ వూళ్లోనే కాపురమున్నదని తెలుసుకొన్న తర్వాత ఆమె ఒంటరిగా వున్నపుడు ఆమెను అనుభవించి, అవమానించా

లనుకొన్నానని, శేఖర్ డబ్బు తానే కేడీ చేత పిక్‌పాకెట్ చేయించానని, ఆమె యింట్లో ఒక్కతేవుండగా తాను వెళ్లానని, ఆమె మండుతున్న స్టవ్‌ను తన మీదకి విసిరిందని, తాను డబ్బాలోని కిరోసిన్ ఆమె పైకి గుమ్మరించి జుట్టు పట్టుకొని లైటర్ వెలిగించి ఆమెపై వేసి మెల్లగా జారుకొని వచ్చేశానని చెప్పేశాడు.

రేవతిది వరకట్న హత్య గాకుండా ప్రతీకార హత్యగా ఋజువైంది. అమాయకుడు శేఖర్ రక్షింపబడ్డాడు.

-***-

# సమస్య తీరింది

సుధాకర్ బి.టెక్ పరీక్షలు వ్రాసి యింటికొచ్చాడు. వచ్చిన మూడోరోజే యింటికి అతిథులొచ్చారు.

వచ్చినవాళ్ళకు సుధాకర్ తండ్రి రామమూర్తి గారు సుధాకర్‌ని పరిచయం చేశారు. ఆ వచ్చిన వాళ్ళిద్దరూ కూడా తండ్రీ కొడుకులే. వాళ్ళు తనని తదేకంగా, పరిశీలనగా చూశారు.

వాళ్ళల్లో పెద్దాయన సుందరరామయ్య రిటైర్డు పోలీసాఫీసరు, ఆయన కుమారుడు రాజశేఖరం లెక్చరరు. సాయంకాలం వాళ్ళు వెళ్ళిన తర్వాత తండ్రి వాళ్ళ గురించి సుధాకర్‌కు చెప్పాడు, వాళ్ళమ్మాయిని సుధాకర్‌కివ్వడానికి పెళ్లి సంబంధం చూడవచ్చారని. ఓ మంచిరోజు చూసుకొని వాళ్ళవూరెళ్ళి అమ్మాయిని చూసిరావలసి వుంటుందన్నారు రామ్మూర్తిగారు.

తల్లి విశాలాక్షమ్మగారు కొడుకుతో "బాబూ! మీ నాన్న మాటలకేం గాని నువ్వు మీ మామయ్య కూతురు పద్మను పెళ్ళి చేసుకో. అయిన సంబంధం. మంచికి, చెడ్డకు, ముందుకు వెనక్కీ ఆసరాగా వుంటుంది. బావుంటుంది కూడా" కాని ఆమె మాటలకు రామ్మూర్తి అడ్డుపడి "ఒరే సుధాకర్ మీ మామయ్య పెళ్ళి ఖర్చులు కూడా మన నెత్తిన రుద్దేరకం. ఇక కట్న కానుకలు, లాంఛనాల గతి దేవుడెరుగు. ఎందుకొచ్చిన పీడ" అంటూ విశాలాక్షమ్మ వైపు చూశాడు. ఆవిడ "అయితే మావాళ్ళ సంబంధం మీకు పీడగా వుందా?" అంది. రామ్మూర్తిగారు "ఉన్న మాటంటె ఉలుకెందుకే. చూడు సుందరరామయ్యగారి సంబంధం చేసుకొంటే ఓ లక్షకు పైగా ముట్టచెబుతారు" ఆయన ఆ మాటంటూనే విశాలాక్షమ్మ "చూశావా బాబూ మీ నాన్నకెంత డబ్బు కక్కుర్తో" అన్నది. ఇక వారి వాదాన్ని అక్కడికి తుంచివేయాలని అంతవరకు శ్రోతగా వుండిన సుధాకర్ "నా పెళ్ళికిప్పుడేం తొందర, నా పరీక్షల రిజల్ట్సు రావాలి, ఉద్యోగం దొరకాలి. ఆ తర్వాత కదా పెళ్ళి మాట" అని బయటకొచ్చేశాడు.

పది రోజుల తర్వాత సుధాకర్ పెద్దన్నయ్యా, పెద్ద వదినా యిద్దరూ తిరుపతి నుంచి వచ్చారు. సాయంత్రం అన్నయ్యతో బాటు సుధాకర్ సినిమాకెళ్ళాడు. సినిమా మొదలెట్టక ముందే పెద్దన్నయ్య "ఒరే తమ్ముడూ

నీ చదువై పోయిందిగదా, ఇక ఓ యింటివాడవు కావల్సివుంది. అందుగ్గాను నువ్వు మా పెద్ద బావమరది కూతురు వనజని చేసుకుంటే బావుంటుంది. అయిన సంబంధము. అందులోను మంచి సంబంధమూ కూడా. పైగా మీ వదినె ఈ విషయంలో ఎంతో ఆరాటపడుతోంది " అన్నాడు. సుధాకర్ ఓ చిన్న చిరునవ్వు నవ్వి, తండ్రి అభిప్రాయమూ, తల్లి కోరికా కూడా అన్నయ్యకు వివరించాడు. అందుకు పెద్దన్నయ్య " క్రొత్త సంబంధం వెతుక్కోవలసిన పని లేకుండా నాన్నకి నే చెపుతాలే. ఇక మామయ్య కూతురంటావా, మేనరికాలు పాతకాలం పాటలు. శాస్త్రరీత్యా సరిపడవు కదా " అన్నాడు. సుధాకర్ ముభావంగా వుంటూ సినిమా చూడ్డంలో లీనమైపోయాడు.

రెండు రోజుల తర్వాత అన్నా, వదినె తిరిగి వాళ్ళ వూరు వెళ్ళారు. వాళ్లు వెళ్ళిన తర్వాత ఇంట్లో వాలకం చూస్తే పెద్దన్నయ్య నాన్నగారితో ఏమీ చెప్పినట్లే తోచింది సుధాకర్‌కి. రోజులు గడుస్తుండగా చిన్నన్నయ్య నుంచి ఉత్తరం వచ్చింది. అందులో సుధాకర్‌ని తన వద్దకు హైదరాబాదు పంపమని నాన్నను అభ్యర్థిస్తూ వ్రాశాడు. అందులోనే ఒక పేరా సుధాకర్‌ని వుద్దేశించి కూడా వ్రాశాడాయన. కొన్నాళ్లు చిన్నన్నయ్య దగ్గర వుంటే, తల్లి దండ్రులు చేసే పెళ్ళి సణుగుడు, నసుగుడు తప్పుతాయని సుధాకర్ హైద్రాబాద్ వెళ్లాడు. హైద్రాబాదులో కాలం

హాయిగానే గడుస్తోంది. ఒక ఆదివారంనాడు భోజనాల దగ్గర "తమ్ముడూ, సుధాకర్ నువ్వు మీ వదిన చెల్లెలు కమలని పెళ్ళి చేసుకొంటే బాగుంటుందిరా. అమ్మాయిని నువ్వు చూశావుగదా చక్కగా కుందనపు బొమ్మలా వుంటుంది. ఇప్పుడు బి. ఏ. పరీక్షలు వ్రాసింది" అని చిన్నన్నయ్య అంటుండగా సుధాకర్‌కి పొలమారి దగ్గు వచ్చింది. చిన్న వదిన మంచినీళ్ళందిస్తూ "మా కమల ఎప్పుడూ నిన్ను అనుకొంటూ వుంటుందయ్యా మరదీ. మా వాళ్లు పెట్టు పోతలలో యేమీ తక్కువ చేయరులే" అని చెప్పింది. అందుకు సమాధానంగా సుధాకర్ "ఉద్యోగమూ, సద్యోగమూ ఏమీ లేకుండా పెళ్లి గొడవేమిటన్నయ్యా" అన్నాడు. కాని "దానిదేముందిరా ఉద్యోగం రాక పోతుందా. పెళ్లి చేసుకొంటె ఉద్యోగం వచ్చేంతవరకూ మా దగ్గరే వుండండి" అన్నాడు చిన్నన్నయ్య.

సుధాకర్ పెద్దన్నయ్య, అమ్మ, నాన్నల ప్రతిపాదల్ని వెంటనే చిన్నన్నయ్యకీ, చిన్న వదినకీ చెప్పలేదు. తర్వాత చూద్దాములే అని మిన్నకున్నాడు. తను హైదరాబాదులో వుండగానే సుధాకర్ రిజల్ట్సు వచ్చాయి. ఫస్టుక్లాసులో పాసయ్యాడు. చిన్నన్నయ్య, చిన్న వదినల దగ్గర సెలవు తీసుకొని ఊరొచ్చేశాడు. ఆ తర్వాత మార్కులు, డిగ్రీ తదితర సర్టిఫికెట్లు తెప్పించుకొని ఉద్యోగాల వేటలో పడ్డాడు సుధాకర్. తొందరగానే మెకానికల్ ఇంజనీర్‌గా విశాఖ

పట్టణంలో భారత హెవీ ప్లేట్స్ అండ్ వెసెల్స్ ఫాక్టరీలో చేరిపోయాడు.

ఉద్యోగంలో చేరింత ర్వాత పెద్దన్నయ్యకీ, చిన్నన్నయ్యకీ, నాన్నకీ, నెల్లూరులో వున్న అక్కయ్యకి ఉత్తరాలు వ్రాశాడు. ఒక వారం తర్వాత అందరి దగ్గర్నుంచీ ఉత్తరాలు వచ్చాయి. అందరూ తమ పాత అభిప్రాయాల్నీ, కోరికల్నీ స్పష్టంగా మరోమారు వెల్లడించారు. అందుకు అక్కయ్య ఉత్తరం కూడా తోడయింది. ఆవిడ తన ఆడపడుచు సరోజని పెళ్లి చేసుకోవలసిందిగా అభ్యర్థించింది. ఈ విషయంలో తన అత్తమామలు తనని నిత్యం సాధిస్తూ వేధిస్తున్నారని సాధ్యమైనంత దీనంగానే వ్రాసింది. అక్కయ్య కోరిక ఆవిడవరకూ సమంజసమేమో కాని అందుకు కారణాలు విడ్డూరంగా వున్నాయి. ఆవిడ అత్తామామలు ఇందుగ్గాను రాచి, రంపాన పెడుతున్నారంటే సుధాకర్‌కి నమ్మశక్యం కాలేదు. ఆవిడ అత్తమామలు ఆవిడని తమ సొంత బిడ్డలానే చూస్తుంటారు. వాళ్ళమ్మాయి సరోజని అక్కయ్య కూడా చాలా ప్రేమగా చూసుకుంటుంది. సరోజమీద వాత్సల్యంతో ఆవిడ ఇలా ఆరాటపడుతోందని సుధాకర్ గ్రహించాడు.

వారానికో, పదిరోజులకో ఎవరో ఒకరి దగ్గరనుంచి సుధాకర్‌కు ఉత్తరాలు వస్తున్నాయి. సుధాకర్ వాళ్ళకి ఉత్తరాలు వ్రాస్తున్నాడు కూడా. కాని వివాహ విషయం

మాత్రం దాటవేస్తున్నాడు. ఆలోచించి చూస్తే పాతకాలం మనిషిగా తండ్రి తన మీద ఎన్నో ఆశలు పెట్టుకొని ఆడంబరంగా అట్టహాసంగా తన పెళ్ళి జరిపించి ఆనందించాలనుకొంటున్నాడు. కాని తనేమో అధునిక యువకుడు. కట్నాలు, కానుకలకు వ్యతిరేకం. ఇక తల్లి పుట్టింటిమీద అభిమానంతో తమ్ముడికి సహాయం చేయాలనుకోవడం సహజమే. పెద్దన్నయ్యా చిన్నన్నయ్యా వాళ్ళ యిష్టాలు, అభిప్రాయాలకంటే వాళ్ళ శ్రీమతుల యిష్టాలకే విలువ యిస్తారు. పాపం వాళ్ళ దృష్టిలో సమంజసంగానే వుండవచ్చు. ఇక అక్కయ్య సంగతి సరేసరి. ఏది ఏమైనా సుధాకర్ పీస్లు సూచించిన సంబంధాలలో ఏ ఒక్క సంబంధం వైపు మొగ్గు చూపినా మిగిలిన వాళ్ళను బాధపెట్టడమే అవుతుంది. కట్న సంబంధాలు తనకు గిట్టవు. మిగతా అయిన సంబంధాల్లో ఏ సంబంధం పట్లా తనకు ఆసక్తి లేదు.

ఉత్తరాల ఊబిలో కూరుకుపోతున్న సుధాకర్‌కి సమస్య ఏ విధంగా పరిష్కారం చేసుకోవాలో అర్థం కావడం లేదు. కాలము దొర్లిస్తూ చూద్దాంలే అనుకొంటున్నాడతను. ఈ వారంలో తండ్రి వ్రాసిన లేటెస్ట్ లెటరులో సుందరరామయ్యగారు, పెళ్ళి చూపులు విశాఖపట్నంలోనే వారి బావమరది ఇంట్లో ఏర్పాటు చేస్తానన్నాడని, కానీ వారి యింట్లోనే ఆ ఏర్పాటు చేయించవలసిందని వారికి వ్రాశానని సాధ్యమైనంత త్వరలో సెలవుపెట్టి రావలసిందని వ్రాశారు.

అందుకు బదులుగా సుధాకర్ యిప్పుడు సెలవు యిచ్చే పరిస్థితి లేదని తెలిపాడు.

ఒక రోజున సుధాకర్ బస్ స్టాపువద్ద నిల్చొని వుండగా ఒక అమ్మాయి పుస్తకాలు చేత్తో పట్టుకొని నెమ్మదిగా వుమెన్స్ కాలేజికి నడచి వెళ్తోంది. నేలంతా అప్పుడే వెలిసిన వాననీళ్ళతో బురదగా వుంది. సరిగ్గా ఆ బస్టాపు దగ్గరే ఓ కుర్రాడు వయస్సు పదేండ్లవాడు సైకిలు త్రొక్కుకుంటూ బ్యాలన్సు తప్పి ఆ అమ్మాయికి డ్యాష్ యిచ్చాడు. ఆ అమ్మాయి పుస్తకాలన్నీ క్రింద బురదలో పడిపోయాయి. పైగా సైకిలు టైరు ఆ అమ్మాయి చీరకుచ్చిళ్ళను ఖరాబు చేసింది. అక్కడున్న వారు కొందరు పళ్ళు యికిలించి నవ్వుతూ వుంటే, కొందరు ఆ అబ్బాయిని తిడతూవున్నారు. సుధాకర్ ఆ అమ్మాయి పుస్తకాలు తీసి యిచ్చి, రిక్షా మాట్లాడి యింటికి పంపించాడు. ఆ అమ్మాయి సుధాకర్ అద్దెకుండే వీధిలోనే వుంటోంది. పేరు రేణుక. తండ్రి విశాఖ జిల్లాలో ఓ పరిషత్ హైస్కూల్ టీచరు. తను మరో ముగ్గురమ్మాయిలు కలిసి యిల్లు తీసుకొని స్వయంగా వండుకొని తింటూ చదువుకొంటున్నారు. రేణుక మరుసటి రోజు అదే స్టాపు వద్ద సుధాకర్ ని కలవడం తటస్థించింది. థ్యాంక్స్ చెప్పింది. మెల్లగా వాళ్ళ పరిచయం పరస్పరాకర్షణకు దారితీసింది. సుధాకర్ కు తన సమస్యకు పరిష్కారం లీలగా పొడచూపింది. కాని రేణుక సందిగ్ధంలో పడింది.

తన తండ్రి తనకు సుధాకర్ లాంటి వరుణ్ణి తేలేడని తెలుసు ఆమెకు. సుధాకర్ తనని పెళ్లి చేసుకోంటాడా? లేక పైపై ప్రేమతో, కబుర్లతో సరిపెడతాడా? అనే మీమాంసతో కొట్టుమిట్టాడి ఓ శుభఘడియలో సుధాకర్ అభిప్రాయాన్ని తెలుసుకోగోరింది. సుధాకర్ అందుకే కాచుక్కూచున్నట్లు తానామెను వివాహం చేసుకోంటా నన్నాడు. తన వాళ్ళు సూచించిన పద్మనో, వనజనో, కమలనో, సరోజనో, తండ్రి చెప్పిన కట్నసుందరినో వీళ్ళల్లో ఎవరోన్న ఒకర్నే చేసుకుంటే తన జీవితం ఏ రాయి అయితేనేం పళ్ళు వూడగొట్టుకోడానికి అన్నట్లే వుంటుంది తప్ప సుఖ శాంతులుండవు. అయితే తనవాళ్ళెవరూ రారని రేణుక తలి దండ్రుల్ని పిలిపించమన్నాడు కాని రేణుక తన పరిస్థితిని వివరించింది. ఆమె తలిదండ్రులు తన కిష్టంలేకున్నా మేనమామ కిచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నారని చెప్పింది. తమ పెళ్ళికి తామే పెద్దలని, కావలసిన మిత్రులను ఆహ్వానించి రిజిస్ట్రార్ ఆఫీసులో సుధాకర్ రేణుక పెళ్ళి చేసుకొన్నారు. మిత్రులంతా కలిసి రిసెప్షన్ ఏర్పాటు చేశారు. మర్నాటిరోజే సుధాకర్ తనవాళ్ళందరికి ఉత్తరాలు వ్రాస్తూ తన పెళ్లి సమస్య తీరిందని వాళ్ళెవరూ బాధ పడనక్కర లేదని జరిగినదంతా తెలియబరుస్తూ గుండెల నిండా వూపిరి పీల్చుకొన్నాడు.

0 0 0

# కళ్ళు తెరవండి

అది ఒక పల్లెటూరు. పల్లెటూరంటే ఇటు కుగ్రామమూ కాదు, అటు చిన్న పట్నమైనా కాదు.

కాని దాదాపు ఇరవై రెవిన్యూ గ్రామాలకు కూడలిగా వున్నది. ఆ వూరు రామాపురం. ఆ వూర్లో ఒక పోస్టాఫీసు, ఇటీవలనే ప్రారంభించబడిన హైస్కూలు వున్నాయి. వీటికి తోడు యీ సంవత్సరమే ప్రభుత్వ ఆసుపత్రి కూడా ఒకటి నెలకొన్నది.

అందులో ఒక ఆర్డర్లీ వున్నాడు. ఆసుపత్రి పెట్టి ఆరు మాసాలు కావస్తున్నా డాక్టరు లేడు. ఒకరి తర్వాత ఒకర్ని ముగ్గురు డాక్టర్లకు ఆర్డర్లు పంపారట కాని వాళ్లు ఆ పల్లెటూర్లో పని చేయడానికి యిష్టం లేక కాబోలు ఒక్కరూ చేరలేదు.

చివరికి రమణమూర్తికి అక్కడి డాక్టరుగా పోస్టింగిచ్చారు. రమణమూర్తి వుత్సాహవంతుడైన యువకుడు. గ్రామీణ ప్రాంతాల్లో సేవ చేయాలనే ఉబలాటం ఆయనకు

వుండబట్టి రామాపురం ఆసుపత్రికి డాక్టరుగా వచ్చాడు. ఆ నెలలోనే కుటుంబాన్ని కూడా తీసుకొచ్చేశాడు. కుటుంబ మంటే ఆయన భార్య పద్మావతి, కొడుకు నాలుగేండ్ల బుజ్జితడు మోహన్.

డాక్టర్ రమణమూర్తి శ్రద్ధగా ఓపిగ్గా తన విధిని నెరవేర్చుతూ జనంలో మంచి పేరు తెచ్చుకొంటున్నాడు. ఆ చిన్న ఆసుపత్రి రామాపురం, చుట్టుపట్ల గ్రామాలన్నిటి అవసరాలు తీర్చ లేదు గాబట్టి వూళ్ళో నిరుద్యోగ యువకుల చేత రెండు మందుల షాపులు పెట్టించాడు. డాక్టరుగా తానిట్టు వున్నాడు కాబట్టి మందుల కొరతయినా ఆ ప్రాంతానికి లేకుండా చేయగలిగాడు.

పల్లె ప్రాంతాల్లో ఆరోగ్య వైద్య విధానాలను కొంతైనా మెరుగుపర్చాలనే వుద్దేశ్యంతో గ్రామీణ ఆరోగ్య కార్యకర్తల్ని తగు మాత్రపు శిక్షణతో నియమించింది ప్రభుత్వం. రామాపురం చుట్టుపట్ల గ్రామాలకు ముగ్గుర్ని నియమిస్తే అందులో సుబ్రమణ్యం అనే అతడు మాత్రమే చేరాడు. మిగిలిన యిద్దరూ మారుమూల ప్రాంతాలకు యిష్టంలేకనో ఏమో మరి అసలు చేరనేలేదు. సుబ్రమణ్యం డాక్టర్ రమణమూర్తితో పరిచయం పెంచుకొని ఆయన సలహాల మేరకు గ్రామాల్లో వైద్య, ఆరోగ్య సూత్రాలను ప్రచారం చేస్తూ అవసరమైన సందర్భాల్లో ప్రథమ చికిత్సలు కూడా చేస్తూ వుంటాడు. వ్యాధిగ్రస్తుల అవసరాన్ని బట్టి

వాళ్ళను రామాపురం తీసుకొచ్చి రమణమూర్తిగారిచేత వైద్యం చేయిస్తూ వుండేవాడు.

రమణమూర్తి ఎందరికో పెద్దలకు పిల్లలకు, పేదలకు, ధనవంతులకు తారతమ్య భేదం లేకుండా ఎన్నో రకాల వ్యాధులకు వైద్యం చేస్తూ, ఎందరికో బాగుచేస్తూ సాధ్యంకాని కొందర్ని జిల్లా ఆసుపత్రికి పంపుతూ తన విధ్యుక్త ధర్మం నెరవేరుస్తున్నాడు. అయితే ఆయనకు ఎదురయ్యే కేసులు సర్వసామాన్యంగానే వుంటూ ఎక్కువ భాగం అజాగ్రత్త వల్ల అమాయకత్వం వల్ల కలిగే జబ్బులనే నయంచేయాల్సి వస్తున్నది.

ఒక రోజు ఒక పేదరాలు తన బిడ్డను ఆసుపత్రికి తెచ్చింది. బిడ్డ వయస్సు ఒక సంవత్సరమే. ఆ బిడ్డ కాళ్ళు, చేతులు సన్నగా పుల్లల్లాగున్నాయి. కడుపు మాత్రం బాగా వుబ్బి పెద్దదిగా వుంది. ఆ వయస్సులో ఆ పిల్లాడికి లివర్ వ్యాధి. బిడ్డను పరీక్షించి రమణమూర్తి ఆమెను ప్రశ్నించాడు అనేక విధాలుగా. ఆమె చెప్పినదాన్ని బట్టి తల్లి పాలకొరత వల్ల ఆ బిడ్డకు అయిదో నెల నుంచే అన్నం పెట్టడం మొదలు పెట్టారు. వాళ్ళకు పాడిపశువులున్నా పాలు బిడ్డకు కూడా తాపకుండా రామాపురం హోటలుకు అమ్ముతుంటారు. అంతకుముందు బిడ్డకు బేదులు అవుతుండేవి. పెద్దలు తినే అన్నమూ కారము పిల్లవానికూడా పెడుతుంటారు. అంతా విని రమణమూర్తి ఆ తల్లి అజ్ఞానానికి బాధపడి

మందులిచ్చి, పథ్యం వగైరాలు చెప్పి పంపాడు. ఆమె తగిన ఆహారం తీసుకొని వుంటే బిడ్డకు తగిన తల్లి పాలు లభించేవి. కనీసం వాళ్ళ పాడి ద్వారా వచ్చేపాలైనా తగిన మోతాదుల్లో యిస్తూ వుండి వుంటే ఆ పసిబిడ్డ ఆ విధంగా రోగిష్టి అయ్యేవాడు కాదు. ఇట్లా పుట్టుక నుంచే ఆహార లోపం వల్ల ఎందరు శిశువులు రోగులవుతున్నారో లెక్క లేదు.

ఒక రోజున సుబ్రహ్మణ్యం ఇద్దరు రైతులతో ఆసుపత్రికి వచ్చాడు. అందులో ఒకాయన భుజం మీద ఒక అమ్మాయి మూడేండ్ల పిల్ల వ్రేలాడుతూ వుంది. రమణమూర్తి వెంటనే పరిస్థితి గ్రహించి ఆ బిడ్డను పరీక్షించి, ఆలస్యం చేయకుండా సెలైన్‌తో గ్లూకోజ్ వాటర్‌తో వైద్యం చేశాడు. రెండవ రైతు వెంట ఎనిమిదేండ్ల అబ్బాయి వున్నాడు. వాడికి కడుపు ఉబ్బి, కళ్ళు పచ్చగా ఉన్నాయి. ఆ అబ్బాయికి కామెర్ల వ్యాధి అని వెంటనే గ్రహించాడు. తగిన మందులిచ్చి జాగ్రత్తలు చెప్పినాడు. డాక్టర్ వాళ్ళతో ఇది వానాకాలం కదా నీళ్ళు కాచి, చల్లార్చి, వడగట్టి తాగుతున్నారా? అని అడిగాడు. సుబ్రహ్మణ్యం తానందరికీ పల్లెల్లో ఆ జాగ్రత్త గురించి చెప్పేనన్నాడు. కాని ఆ రైతులిద్దరూ తమ పనుల్లో తీరుబాటు లేక అజాగ్రత్తగా వుండినామని అందుకు తమ బిడ్డల ఆరోగ్యం పాడైందన్నారు. అంతలో అటువంటి పేషెంట్లతో మరి కొందరు తల్లిదండ్రులు ఆసుపత్రికి వచ్చారు. రమణమూర్తి సుబ్రహ్మణ్యం సహాయంతో,

ఆరక్ష్మి సహాయంతో అందరికీ తగిన పద్ధతుల్లో చికిత్స చేశాము. వాళ్ళల్లో ఎక్కువమంది చిన్నపిల్లలే.

రమణమూర్తి వాళ్ళందర్నీ వరుసగా అనేక ప్రశ్న లడిగినాడు. అనేక విషయాలు రాబట్టినాడు. ఆహార నియమాలు, ఆరోగ్య సూత్రాలు గురించి వాళ్ళకు ఎంతో ఓపికగా విపులీకరించినాడు.

గ్రామస్థుల యిండ్లలో ఎంతమంది పెరళ్ళలో కూర గాయలు, ఆకుకూరలు పెంచుతున్నారో అడిగినాడు. చాలా మంది వాళ్ళు పెంచే, కూరగాయల, ఆకుకూరల గురించి చెప్పారు. కొందరు పొలాల్లోనే ఆకుకూరలు, కాయ కూరలు పండిస్తున్నామన్నారు. కాని అందరు ఆ కూర లన్నింటిన్నీ రామాపురంలోను, యితర పట్టణాల్లో అమ్ముకొని సొమ్ము చేసుకుంటున్నట్లు చెప్పేశారు. ఇక పండ్ల చెట్ల గురించి కూడా రైతులు గాని, రైతు కూలీలు గాని, జామ, దానిమ్మ, అరటిచెట్లు పెంచుతున్నట్లు, కొందరు నారింజ తోటలు కలిగివున్నట్లు చెప్పారు. వాళ్ళు పండించే పండ్లన్నీ అమ్మకానికి తరలిపోతుంటాయని పండ్లకు మంచి రేట్లు వుండటం వల్ల ఈ మధ్య తమ ఆదాయం కొంత పెరిగినట్లు ఆ రైతులు చెప్పారు.

మీలో ఎవరెవరు ఏ ఏ రకాలుగా రోజూ ఆకుకూరల్లూ కాయగూరలు వండుకొని తింటున్నారో, అట్లే పండ్లు కూడా ఎప్పుడెప్పుడు తింటున్నారో చెప్పండని రమణమూర్తి వాళ్ళని

అడిగాడు. ఆ పండ్లూ ఆకుకూరలు మేమెప్పుడు తింటాం బాబూ ! ఎప్పుడో పండగలప్పుడు తప్ప అన్నారు అందరూ. అయితే మీ పిల్లలకు ఏమేమి ఆహారం యిస్తారు అంటే అందుకు కూడా అందరూ తాము తినేదే వాళ్ళకూ పెడతామన్నారు. ప్రొద్దున్నే చద్దన్నం లేకుంటే అంబలి అందులోకి కారపు ముద్ద, మధ్యాహ్నం, రాత్రి సంకటి లేకుంటే అన్నం అంటుండగా మధ్యలో రమణమూర్తి కూరలేం వాడతారు అన్నాడు. పచ్చళ్ళు, అప్పుడప్పుడు పప్పు అన్నారు వాళ్ళు. మజ్జిగ వాడరా అని అడిగాడు. ఎప్పుడైనా పాలు అమ్మి వేయగా మిగిలితే తోడు వేసి వాడుకుంటాము.

అయితే మీ పిల్లలకు కూడా పాలు, మీరు పండించే పండ్లు యివ్వరా ? అన్నాడు డాక్టరు. అందరూ ముక్త కంఠంతో లేదన్నారు. రమణమూర్తి వాళ్ళందరికీ బాగా బుద్ధి చెప్పి బ్రెయిన్ వాష్ చేయాలనుకొన్నాడు.

“అయ్యా మీరందరూ ఆకుకూరలు, కాయగూరలు, పండ్లు ఫలాలు అన్నీ పండిస్తారు. పాడి బాగా వుంది. కాని మీరు మాత్రం అవి అనుభవించరు. కనీసం మీ పిల్లలకైనా పెట్టరు. ఇందువల్ల మీరూ, మీ పిల్లలూ రోగగ్రస్తులై పోతున్నారు. పాలు, పండ్లు కాయలు, ఆకుకూరలు మనం తినే అన్నం కంటే విలువయినవిగా మీరు గుర్తించండి. ఇవన్నీ కలిపి మనం ఆహారంగా తీసుకొంటే ఇప్పుడు మీ పిల్లల్ని బాధపెట్టే జబ్బులు ఒకటీ రావు. జబ్బులు

వచ్చింతర్వాత వాటిని నయం చేసుకోవటం కంటే వాటిని రాకుండా జాగ్రత్త పడటం మంచిది. పరిశుభ్రమైన నీళ్ళు, పోషక విలువలతో ఆహారపదార్థాలు మీకు మీ వద్దనే ఉన్నాయి. వాటిని చక్కగా వినియోగించుకోండి. ఇకనైనా కళ్ళు తెరవండి" అని రమణమూర్తి అంటుండగా రామాపురం ప్రెసిడెంటుగారి అబ్బాయిని అక్కడికి తీసుకొచ్చారు. అబ్బాయి బాగా బొందలంగా వున్నాడు. నిన్నటి నుంచి బేదులవుతున్నాయట. రెండు రోజులుగా ఆ అబ్బాయి తీసుకొన్న ఆహారాన్ని గురించి అడిగారాయన. అందుకు పాలేరు "తాము సమగ్ర ఆహారం గురించి చెప్పారట. అప్పటినుండి అబ్బాయిగారికి అరలీటరు పాలు, రెండు గ్రుడ్లు, రాత్రిపూట చేపల పులుసు మధ్యాహ్నం అరకేజి కాయగూరలు పెడుతున్నారు" అన్నాడు. "అంతే కాదండీ, మా యింట్లో నిన్న భక్ష్యాలు చేశారు. మా అయ్య నాలుగు లాగించేయమన్నాడు. లాగించేశా" అన్నాడు ఆ యెనిమిదేండ్ల కుర్రాడు.

డాక్టరు తల కొట్టుకొని "సమగ్రాహారం తీసుకోమంటే అమితాహారం తీసుకొంటే యెట్లాగయ్యా" అని, అప్పటికి తగిన మందిచ్చి, "నేను వచ్చి ప్రెసిడెంటుగారితో మాట్లాడతాను వెళ్ళండి" అన్నాడు. అక్కడున్నవాళ్ళతో

" చూశారా, ఆహార లోపమూ వుండకూడదు. అమితాహారమూ తీసుకోకూడదు. సమగ్రాహారాన్ని మితంగా తీసుకోడానికి అందరూ నెమ్మదిగా అలవాటు పడండి. మగువకండి " అని చెప్పి అందర్నీ పంపించాడు.

తరవాత రమణమూర్తి ఆసుపత్రికే పరిమితంగాకుండా అప్పుడప్పుడు వీలు చూసుకొని చుట్టుపక్కల గ్రామాలకు పోయి ఆరోగ్యసూత్రాలు ఆహార నియమాలు ప్రచారం కూడా చేయసాగాడు.

అందరూ రమణమూర్తులయితే అజ్ఞానం, అవిద్య కరడుకట్టుకొని వున్న గ్రామసీమలు యెందుకు బాగుపడకుండా వుంటాయి ?

-***-

# నిజం లేచిపోయింది

ఆ రోజు నేనూ, ప్రభాకర్ ఇద్దరము రాజంపేట బస్టాండులో నిల్చున్నాము, కోడూరు వెళ్ళడానికి. మంచి వేసవికాలం యెండ దంచేస్తూవుంది.

చెమట్లు కార్చుకుంటూ, చేతి గుడ్డలతో తుడుచుకుంటూ, ఆపసోపాలు పడుతూ వుండగా ఓ అరగంట తర్వాత బస్సు వచ్చింది.

ఆదరా బాదరా బస్సెక్కి ఖాళీగావున్నా వెనక వరుసల్లో ఒక చోట కూర్చున్నాము. బస్సు బయల్దేరి పోసాగింది. పుల్లంపేటలో బస్సు ఆగినపుడు దిగే వాళ్ళు లేక పోగా మరో నలుగురు ఎక్కారు. వాళ్ళలో ఒకరు బట్టల వ్యాపారి, మరొకరు స్టూడెంటులా వున్నాడు. ఇద్దరు మహిళలు.

ఆ తర్వాత అనంతపల్లె. ఓ ఆసామి బస్సెక్కాడు. మా ముందువరుసలో ఓ సీటు ఖాళీ వుంటే కూర్చున్నాడు.

మనిషి భారీ విగ్రహం. ఖద్దరు పంచె, లాల్చీ, భుజం మీామగా సిల్కు కండువా, కళ్ళకు రోల్డు గోల్డు ఫ్రేము తోటి నల్లద్దాలతో ఠీవిగానే వున్నాడు. బస్సు స్టార్టయింది. అంతలోనే యిద్దరు వ్యక్తులు బస్సు ముందుకు వచ్చి చేయి చూపి, బస్సు కదలక ముందే ఎక్కేసి ఠీవి మనిషి పక్కనున్న ఖాళీ సీట్లలో కూర్చున్నారు. చూస్తుంటే వాళ్ళెక్కడో పక్క పల్లె నుంచి యెండన పడి వగరుస్తూ వచ్చినట్లుంది.

వాళ్ళలో ఒక వ్యక్తి ముప్పయి యేండ్ల వాడు బక్క చిక్కి నెత్తికి మాసిన తుండు కండువా చుట్టుకొని పైన చొక్కా లేకుండా, మోకాలికి పైగా బిగించిన పంచెతో చేతిలో ఒక సత్తు టిఫిన్ గిన్నెతో వున్నాడు. మరో వ్యక్తి అరవై యేండ్ల ముసలావిడ. వాలకం చూస్తే అతడి తల్లిలా వుంది. ఆమె చేతిలో ఒక బట్టల సంచి. వాళ్ళు వ్యవసాయ కూలీల్లా వున్నారు.

బస్సు కదిలింది. ఆ కదలికతో అది ఆగినప్పుడు అందరి ఒంటికీ పట్టిన చెమట గాలి వీచి ఆరిపోసాగింది. బస్సు వేగాన్ని పుంజుకొంటున్న కొద్దీ గాలి బాగా ఆడుతున్నది. కొంతమందికి కొద్దికొద్దిగా కునుకుపట్టే దశ వుంది. సత్తు గిన్నె వ్యక్తి గిన్నె మూతను నోటిదగ్గరుంచుకొని కొంచెం కొంచెంగా గుటకలు వేస్తున్నాడు. మా వెనుక వరుసలోని వ్యాపారి “ఏందయ్యా, ఏందో చెడ్డ కంపు వస్తావుంది. తుమ్మసారాయిలాంటి ఘాటువాసన వేస్తూవుందే” అన్నాడు.

అతనలా అంటూ వుంటే మా అందరి ముక్కుపుటాలు ఆ వాసనను అనుభవించడం జరిగింది. స్ట్రూడెంటు బస్సులో తన ముందున్న వాళ్ల వైపు పరిశీలనగా చూచి, గసతో వగరుస్తూ గుటక లేస్తున్న మనిషి వైపు చూపు నిలిపి " అవో ఆ పనికి మాలిన కూలోడు బస్సులోనే తాగుతున్నట్లుంది కండ్లు మూతలు పడి సోలిపోతున్నాడు. చూడండి " అని అసహ్యాం నింపుకున్న గొంతులో నుంచి మాటన్ని పెగిలించాడు. ఆ దగ్గర్లోని సీట్లలో వున్న వాళ్ళందరి చూపులు ఆ కూలి మనిషి మీద పడ్డాయి. బట్టల వ్యాపారి అతన్తో "ఏవాయ్" ఏకంగా బస్సులోనే తాగేస్తున్నావ్." అని కసిరాడు. మరొకాయన " గవర్నమెంటుకు బుద్ధి లేదు ప్రభుత్వ సారా దుకాణాలు పెట్టించి యిట్లాంటి కూలోళ్ళను నాశనం చేస్తున్నారు. " అన్నాడు. ఆ కూలి మనిషి ఏం మాట్లాడ లేదు. ముసలామె " లేదు బాబూ వాడు తాగేది సారాయి కాదు. మంచి నీళ్ళే ఎండన పడి వచ్చిందాన ఒక్కో గుటక మింగుతున్నాడు అయ్యి నీళ్ళే " అంటున్నది. " సరేలే ముసిల్దానా ఎవరికీ తెలీదు మీ యవారాలు, అబద్ధాల్తో కప్పిపుచ్చుతున్నావ్" అన్నారు మరొకరు. మాటల్లోనే మంగంపేట వచ్చింది. ఖద్దరు లాల్చి శాల్తీ లేచి దిగిపోవడం జరిగింది.

" లేదయ్యా మావోడు తాగేవోడు కాదయ్యా ఎండ పొర తగిలి వానికి పేణం బాగా లేదు. ఆ పల్లెలో యీ మంచి నీళ్ళు అడిగి తీసుకొని, బస్సెక్కి ఆ నీళ్ళు తాగుతున్నాడు " అంటూ ఆ ముసలావిడ చెప్పుకుంటూ పోతోంది.

బస్సు మళ్ళీ కదిలింది. ఆ కూలి మనిషి " నేను తాగు తున్నది నీళ్ళు బాబు, చూడు " అని అంటూ ండగా కొంచెం నీళ్ళు తొణికి క్రింద పడ్డాయి. స్టూడెంటు అది చూచి " బస్సెక్కే ముందు సారాయి తాగి యిప్పుడు నీళ్ళు గుట కేస్తున్నావేమో ఎవడు చూడొచ్చాడు " అన్నాడు. " మీలాంటోళ్ళంతా కూటికి లేకున్నా కూలి డబ్బంతా సారాకే ఖర్చు చేసేస్తారు " అని నేను కూడా అన్నాను. బస్సు కదిలి సాగిపోతూవుండగా గాలి వీస్తూ వున్నది. ఆ ముసలావిడ " మేం పేదోళ్ళం నిజం చెప్పినా, మీరంతా పెద్దోళ్ళు నమ్మరు బాబూ " అంటూ వున్నది.

ఇంతలో మా ప్రభాకర్ " ఏమిటయ్యా ఆ మనిషిని పట్టుకు అంతిగా హంగామా చేస్తున్నారు. ఇప్పుడు సారా వాసన వెయ్యడం లేదే " అన్నాడు. అంతవరకు సారాకంపు అనుభూతినే అంటిపెట్టుకున్న మా అందరి ముక్కు పుటాలు శ్రద్ధగా పని చేసి ప్రభాకర్ చెప్పిన సత్యాన్ని కనిపెట్టశాయి. అందరూ " అవును యిప్పుడు వాసనేమీ లేదే " అన్నారు. " సారావాసన రొయిక, నిజం లేచిపోయింది. మీరు గమ నించలేదు. " ప్రభాకర్ చెప్పాడు ముందు సీటు చూపిస్తూ ఖద్దరు లాల్చీ శాల్తీ లేని ఖాళీ సీటు అందర్నీ వెక్కిరించింది. అందరు గతుక్కుమన్నారు, తామంతా యింతవరకు అనవస రంగా అబద్ధాన్ని నిష్ఠూరపర్చినందుకు.

0 0 0

# ఆశాపాశాల్లో అధికారం

దుర్గారావు ఆ నెలలో జిల్లా ఆఫీసరుగా ప్రమోట్ అయ్యాడు. ఆ ప్రమోషన్ చాలా కాలం క్రిందటే రావలిసింది.

తనకు శిఫార్సుల బలం పేలవంగావున్నందున వెనకబడ్డాడు. జిల్లా ఆఫీసరైనప్పటినుంచి దుర్గారావు మనస్సు పట్టపగ్గాల్లేకుండా ధనాశాపాశాల్తో కట్టిన అధికారపీఠం మీద జోరుగా వూగుతూ వున్నది.

దుర్గారావు ఆశకి చాలా కారణాలున్నాయి. కూతురికి ముప్ఫయ్యో, నలభయ్యో వేలు గుమ్మరించి ఓ మాంఛి గ్రూపు వన్ అధికారిని మొగుణ్ణిగా తేవాలి. ఆ పని మీద అప్పుడే పేరయ్యల్నీ, పుల్లయ్యల్నీ పురమాయించాడు. ఇక పోతే ఇంటర్ సీనియర్‌లో వున్న కొడుక్కి సిద్ధార్థ ఇంజినీరింగు కాలేజీలో సీటు రిజర్వేషన్ చేయించాలి. అందుకు పది హేను వేలు పురమాయించుకోవాలి.

ఇంత కాలమూ ఆఫీసు గుమాస్తాగా హెడ్ క్లర్కుగా ప్రక్కన పొట్టిసంతకాలు పెట్టె బాపతుగా వుండిపోయినందున తన భార్యా పిల్లలు సాదా సీదా బట్టలతో సరిపెట్టుకోవడమే అయ్యింది. ఇక మీదట యింట్లో వాళ్ళందరికీ ఆఫీసరు దర్జాకు తగినట్టు బట్టలు కుట్టించాలి. ఇంకా ఫర్నిచరూ వగైరా యేర్పాటు చేసుకోవాలి.

కాబట్టి దీప ముండగానే యిల్లు చక్కబెట్టుకోవాలని దుర్గారావు దృఢంగా నిశ్చయించుకొన్నాడు. టేబిలు మీదున్న ఫైళ్ళను పరిశీలించసాగాడు. వాటిలో ఆఫీసు రొటీన్ ఫైళ్ళతో బాటు ఒక ఎక్స్‌పెల్లరు పెట్టుకోవడానికి సంబంధించి, ఇంకో మిల్లు లైసెన్సు పునరుద్ధరించడానికీ, సిమెంట్ డీలర్‌షిప్పు మంజూరుకు సంబంధించి ఫైళ్ళు కూడా వున్నాయి. ఇట్లాంటి బాపతు ఫైళ్లను వేరుపర్చి మిగతా అన్నిటి లోను సంతకాలు చేసి ఆయా సెక్షనులకు పంపేశాడు.

నాలుగురోజుల వరకు ఆ ఫైళ్ళు ఆఫీసరు వద్దే నిలిచి పోయినయ్. ఆ ఫైళ్ళ సంబంధీకులు సెక్షన్‌లో విచారించి విషయం తెల్సుకొని ఆఫీసరు దుర్గారావునే సందర్శించారు. ముందుగా క్రొత్తఎక్స్‌పెల్లరు పెట్టుకొనేఆసామికి ఇంటర్వ్యూ యిచ్చాడు. అతన్తో ఎంతో ఆప్యాయతతో మాట్లాడి, ఆయన స్థితిగతులన్నీ తెలుసుకొని మెల్లగా లైసెన్సుకు బేరం

పెట్టాడు. చివరికి బేరం యాభై నుంచి ముప్పై వేలకి కుదిరింది, మరుదినమే డబ్బిచ్చి ఆర్డరు పుచ్చుకోనేట్లు.

రెండో ఆసామీ తైసెన్సు పునరుద్ధరణ కేసు జటిలంగా వుందని, ఆ మాటా, ఈ మాటా చెప్పి అదరగొట్టి పదిహేను వేలిచ్చేటట్టు వొప్పించాడు. మూడో ఆసామి డీలరు షిప్పు కోసం రెండు వేలివ్వడానికి సునాయాసంగా వొప్పుకున్నాడు. ఈ మూడు కేసులూ పరిష్కరించేందుకు మాల్సు తిరగే స్తున్నాడు దుర్గారావు. ఆ సమయంలో గురవయ్య ప్రవేశించాడు. గురవయ్య ఆ ఆఫీసులో రికార్డు అసిస్టెంటు. అతని పేఫిక్సేషన్‌లో లోపం జరిగి, గవర్నమెంటు నుంచి అంతా సరిచేయబడి జీతాలు అరియర్సు పదమూడు వందలు బిల్లు చేయబడి ఆఫీసరు సంతకానికి దుర్గారావు టేబిలు మీదికి వచ్చి నాల్గు రోజులైంది. దుర్గారావు దాన్ని కూడా ప్రక్కనుంచుకొన్నాడు.

లోపలికొచ్చిన గురవయ్యను "ఏం" అన్నట్లు తలెగరేశాడు దుర్గారావు. గురవయ్య నోరు విప్పాడు. తన సోదంతా వెళ్ళబోసుకొన్నాడు. దుర్గారావు వింటూ వున్నాడు. మెదడులో మెఱుపులాంటి ఆలోచన తళుక్కు మంది. పిల్ల పెళ్ళికీ, పిల్లవాని కోర్సుకూ, పెళ్ళాం పట్టు చీరలకీ ఏదో విధంగా అదృష్టం కలిసొచ్చింది ఒకేసారి. ఇక పేకి వద్ద కనీసం మూడొందలైనా లాగితే రేపే రంగారావు, రామారావు, సుబ్బారావులతో మిత్ర చతుష్టయం

ఝుామ్మని పార్టీ చేసుకోవచ్చు ఒకటో తారీకువరకూ ఆగఖర్లేకుండా.

మెల్లిగా గురవయ్యతో మంతనం మొదలెట్టాడు. దుర్గారావు మూడొందలడిగేసరికి గురవయ్యకు గొంతు నులిమేసినట్టయ్యింది. మరోసారి తన దీనగాథను వెళ్ళ గక్కాడు. ఆఫీసరు దుర్గారావు సనేమీ వీల్లేదన్నాడు. చివరకు ఏమనుకున్నాడో ఏమో గురవయ్య వొప్పేసు కున్నాడు. మరునాటి సాయంత్రం డబ్బు నర్దుతానన్నాడు. దుర్గారావు మెచ్చుకోలుగా చూస్తుంటే బయటపడ్డాడు. ఆ తర్వాత పార్టీ విషయం మిత్రులకు ఫోన్ చేశేసాడు దుర్గారావు.

గురవయ్య ఆఫీసు నుంచి తిన్నగా ఎస్సీవోహోము కెళ్ళాడు. అక్కడ సెక్రటరీ తన బంధువు. గురవయ్య కథంతా విని యాంటికరప్షను డి. యస్. పీ వద్దకు తీసుకెళ్ళాడు. కథంతా విని వుదయమే ఆఫీసుకొస్తే డిపార్టు మెంటు నోట్లిచ్చి, యిన్స్పెక్టరును పంపుతానన్నాడు.

మరునాడు వుదయం పదిన్నరకే ఎక్స్పెల్లరూ, మిల్లరూ, డీలరు వచ్చేశారు. వరసగా ఒక్కొక్కరినీ పిల్చి రేట్ల ప్రకారం డబ్బులు పుచ్చుకొన్నాడు. గురవయ్యనూ పిలిపించి అడిగాడు దుర్గారావు పార్టీ తాలూకు లాలాజలం వూరుతూవుండగా. గురవయ్య ఆఫీసు టైం అయిపొయ్యే లోగా డబ్బుతో సహా హాజరుంటానన్నాడు. నాలుగున్నరకి

వచ్చిన ఇన్‌స్పెక్టరు సైగతో గురవయ్య ఆఫీసరు గదిలో ప్రవేశించాడు. చెప్పిన ప్రకారం దుర్గారావు చేతిలో నోట్లు పెట్టాడు. వెంటనే ఇన్‌స్పెక్టరు వచ్చి చేతిలో నోట్లు స్వాధీనం చేసుకొంటూ దుర్గారావుని అరెస్టు చేశాడు. అతణ్ణీ, డ్రాయరు సొరుగుల్నీ సోదా చేసి మొత్తం నలభై ఐదు వేల రూపాయలనూ స్వాధీనపర్చుకొని కేసు బుక్ చేశాడు.

దుర్గారావు అరెస్టయ్యాడు. అతని మనస్సు ధనాశా పాశాల్తో కట్టబడిన అధికారాంపీఠం మీద నుంచి పుటుక్కున క్రిందపడి ముక్కలైపోయింది.

* * *